# రహదారిబంగళా



రచయిత:

శ్రీకొల్లేపర వెంకటేశ్వరరావు బి. ఏ.



ప్రకాశకులు:

**ఈశ్వర బుక్ డిపో.,**

కర్రా అచ్చయ్య & సన్సు (స్థాపితము 1888)

ప్రొప్రయిటర్: కర్రా మావుళ్ళయ్య.

రాజమహేంద్రవరము.

---

 [ వెల 0—8—0

# సూచన:

ఆమె విద్యాధికురాలు. నవనాగరికత. పైపెచ్చు సిరిసంపదలతో తులతూగుతూంది. అన్నిటికంటే ముఖ్యమైన విషయం ఆమె పాలపొంగువంటి ప్రాయంలో వుంది. అందుచేత ఆమె యౌవనహృదయం ఆరాటంతోనూ ఆకలితోనూ వేగిపోతోంది.

ఆమె బాలవితంతువనే నెపంమీద ఆ యభాగ్యురాలికి నిరాశ, నిరుత్సాహం గొల్పి, ఆమె నధఃపాతాళలోకానికీడ్చి, ఆనందపడదామని చూస్తుంది సంఘం.

ఆమెహృదయంలో తీయనికోర్కెలు రేకెత్తించి, హృద్వేగం పుట్టించి, పరపురుషసంగమమనే నెపంమీద యామె జీవితపుష్పాన్ని నలిపివైచి, ధనార్జన మొనర్ప చూస్తుంది దుర్మార్గప్రజ.

చివరకు పాపమా యనాధబాలికగతి యేమవుతుంది? ఆమె ధృఢత్వమూ, శీలమూ ఆమెను సంఘంనుంచి, దుర్మార్గులనుంచి యుద్ధరించి సౌఖ్యురాలను జేస్తాయా? అని సూచించడములో నడిచింది యీ సారికలం.

- ఇట్లు,

రచయిత.

# రహదారి బంగళా

—:O:—

౧

'ఇదిగో!...'

... ... ... ... ...

'రాజ్యం!!... ...'

... ... ... ... ... ...

'ఏమండోయ్ రాజ్యంగారు!!!... ...'

'ఏం...నాన్నా?' అంటూ తమలపాకుల పళ్ళెరంతో నాగదిలోకి వచ్చింది చిట్టి. చిట్టి ఆపళ్ళెం టేబిలుమీదపెట్టి, నాకెదురుగా ఉన్నాకుర్చీలో కూర్చొని, టేబిలుమీదనున్న సామగ్రికేసి నాముఖంకేసి చూస్తుంది.

నేను ఆరాత్రి తెచ్చిన మిఠాయీ, పళ్ళూ ఆబల్లపై సర్ది పెట్టేను. రాజ్యానికని తెచ్చిన చీర పందిరిమంచం మీద తళతళా మెరుస్తూ, యజమానురాలు కోసరం వేయికళ్ళువిప్పుకొనిచూస్తూంది. ఇవన్నీ తెచ్చినట్లు, రాజ్యానికీ తెలీదు, మా చిట్టికీ తెలీదు.

'ఇందులో నీకేంకావాలో తీసుకోతల్లీ' అన్నాను చిట్టిని. అవన్నీచూచి, వాళ్ళమ్మ రాజ్యం కూడా ఆశ్చర్య పులకితమౌతుంది కదా అని మురుస్తూన్నా నేను.

'నాకేం వద్దు నాన్నా!' అందిచిట్టి నెమ్మదిగా.

'అయ్యో! అదేం తల్లీ! ఏం ఎందు కక్కరలేదూ?' అన్నాను కొంచెం అధైర్యంపడి. చిట్టినే మురిపింపలేని యీసామగ్రి నా రాజ్యాన్ని మాత్రం సంతోషపెడతాయా?

'ఇప్పుడు నాకేమీ తినబుద్ధిపుట్టడంలేదు. పొద్దుటేతింటానులే నాన్నా' అంది చిట్టి.

నేను నెమ్మదిగా చిట్టిని నా ఒళ్ళోకి లాక్కొని, ముద్దుపెట్టుకొన్నాను.

'ఏం తల్లీ! ఎందుకుతినవు మీఅమ్మగినా నిన్నేమైనా అందా?' అని అడిగాను లాలనగా.

'ఊఁ ఉ...' అని లేదన్నట్టు తలూపింది చిట్టి.

'మరిఎందుకీ నిరశనవ్రతం?' అన్నాను చిట్టిని.

'నాన్నా!...నువ్వు ఊరువెళుతావా? అంది చిట్టి, ప్రకాశవంతములైనా ఆ రెండుకళ్ళూ నామీద లక్ష్యం చేస్తూ.

'అవును తల్లీ' అన్నాను, చిట్టిముఖచిహ్నాలు పరీక్షిస్తూ.

'ఎప్పుడు నాన్నా?' అంది చిట్టి ఆలోచనా స్వాంతమై.

'రేపు తెల్లవారుఝామునే తల్లీ!' అన్నాను.

'నాన్నా! మరేం నువ్వు మళ్ళీ త్వరగావచ్చేయవేం' అంది ప్రాధేయపూర్వకంగా చిట్టి.

'అల్లానేలే తల్లీ' అన్నాను.

'మరి అమ్మా, బాబ్జీ, నేనూ నువ్వులేకుంటే భాగ్యంగాఉండలేం. తమ్ముడు అస్తమానూ నాన్నా! నాన్నా! అని ఏడుస్తూంటాడు. అమ్మకీ ఎప్పుడూ బెంగగానే ఉంటుంది. త్వరగా వచ్చేస్తావా?' అని వాళ్ళ అమ్మతరుపునకాబోలు, ఉపన్యసించింది చిట్టి.

'వెంటనేవచ్చేస్తానులే తల్లీ' అనిప్రేమగా ముద్దుపెట్టుకొన్నాను చిట్టిని. చిట్టి కుదుటపడి నెమ్మదిగా నా యొడిలోంచి జారి, టేబిలుమీదనున్న ద్రాక్షపళ్ళు తింటూంది.

'తల్లీ! చిట్టీ! మీ అమ్మేంచేస్తుంది?' అని అడిగాను చిట్టిని. ఇంకా రాజ్యం రాకపోవడంచేత కొంచెం ఆత్రుతచెంది.

"అమ్మ పనిచేసుకొంటుంది'' అనేసి, మా అమ్మాయి తన తిండి వ్యవహారంలోనే నిమగ్నమైయుంది.

ఇంకా రాజ్యం ఇల్లు చక్కబెట్టుకొనిరాలేదు. తెల్లవారు ఝామున ప్రయాణం. అప్పుడే పదిగంటలైంది. రాజ్యం రావడం ఆలస్యం అయినకొలదీ నాకు కోపంకూడ వస్తూంది. ఇంతలో, వాడి పుణ్యమాంటూ మా అబ్బాయి బాబ్జీ లేచి 'నాన్నా!' అని ఏడుస్తూన్నాడు. ఇప్పుడైనా వాళ్ళమ్మరాదూ? అనుకొంటూంటే చిట్టి ఇల్లా అంది.

'అదిగో నాన్నా! అబ్బాయి బాబ్జీ-చూడు, నాన్నా! అని ఏడుస్తూన్నాడు. ఇవ్వాళ అస్తమానూ నాన్న ఊరు వెళతారు అని అమ్మ చెప్పింది బాబ్జీకి' అంది చిట్టి.

'మహాగొప్పపనిచేసింది' అని సణుగుకొన్నాను. బాబ్జీ ఏడుస్తూ పట్టెమంచం మధ్యన లేచి కూర్చున్నాడు.

'తల్లీ! బాబ్జీ ఇంక ఏడుపుమానడు. ఆకలి వేస్తుందల్లేఉంది. కాస్త మీ అమ్మను పిలు, పాలిస్తుంది బాబ్జీకి' అన్నాను నేను చిట్టితో.

'నా బంగారుబాబ్జీ! నాముద్దులబాబ్జీ!' అంటూ చిట్టివెళ్ళి బాబ్జీని మరల పరుండజేసి తాను వాడిపక్కలో పండుకొని 'దాయిదాయి బాబ్జీ!' అంటూజోకొట్టుతుంది. అంతేగాని వాళ్ళమ్మను పిలువలేదు. కుఱ్ఱవాని మూలాన్నైనా వేగంగా వస్తుంది రాజ్యం అనుకొంటే వాణ్ణి చిట్టే సముదాయించేసింది. ఆ అల్లరిపెధవకూడ ఆసమయాన్ని కిక్కురుమనకుండా మరల పండుకొన్నాడు.

ఏం, వీళ్ళంతా నామి [illegible] కట్టుడిక[illegible]గు?

ఓపిగ్గా అల్లానేకూర్చు[illegible] [illegible]జ్యంరాలేదు. చిట్టి, బాబ్జీ కూడ సుఖంగా నిద్రపోతు[illegible] [illegible] సుఖనిద్రచూస్తే నాకూ ఆవలింతలు వస్తున్నాయి. ఎ[illegible] కూర్చొనేది? అయినా తప్పు

తుందా? పొద్దుగూకే ప్రయాణమైతే. రాజ్యంతో బోల్డుగొడవలు మాట్లాడాలి.

పరీక్షకు వెళుతున్నా విద్యార్థిలా, న్యూస్‌పేపరుదీసి, కునికిపాట్లుపడుతూ చదివిందే చదువుతూన్నా. పదకొండుగంటలు కొట్టారు విసుగొచ్చింది. ఒక్కవిసురున వెళ్ళి నా పందిరిమంచంమీద పడ్డాను. అంతకోపం పనికిరాదన్నట్టు, ఆస్ప్రింగుకాట్ ఎత్తిపడేసింది నన్ను. అక్కడున్న క్రొత్తచీర 'మధ్య నేనేం తప్పుచేశా'నని గోలపెడుతూ వెళ్ళి మూలగానున్న బీరువామీదపడి వేళ్ళాడుతూ, ఇంకా నేను దాన్నేమైనా చేస్తానేమోననే బెదురుతో క్రిందపడి నాదృక్పథాన్నించి తప్పుకొందామని యత్నిస్తూంది.

ఆలోచనలతో విసివిసోయిన నాబుఱ్ఱకు విశ్రాంతి ఎక్కువ అవసరమైపోయింది. దక్షిణవైపునున్న పెద్దకటకటాల గవాక్షంగుండా చల్లని గాలి వీస్తూంటే, మగత మగతగా నిద్రపట్టుతోంది.

'మహారాజులా నిద్రపోతున్నారు' అను పలుకులు వినపడీ టప్పటికల్లా, ఉలికిపడి లేచి చూసేసరికి మహారాణి ప్రత్యక్షమయింది.

రాజ్యం పసుపుపిల్లలా తయారయింది బనాయించిన షోకుతో క్రొత్తపెళ్ళికూతురులా— ఆ వేషంలో నవ్యతీయందనం, ఆవిశాలాక్షులలో ముగ్ధత్వమూనూ.

'ఎంతసుఖంగా నిద్రపోతున్నారండీ? చేసుకొన్నా పెళ్ళాన్నీ, కన్నబిడ్డనూ విడిచిపెట్టి వెళ్ళలేక ఆ బుద్ధదేవుడైనా మనస్తాపంచెందేడే గానీ, మీకా వీకూ చింతా, ఏం ఉండవు పాపం' అంది రాజ్యం మొదట్లోనే నన్ను నిందిస్తూ. ఇంత ఆలస్యంగా వచ్చినందుకు దాన్ని ఏమైనా అనడానికి ఇంక నాకు అవకాశం ఏముందీ?

'అయితే రాజ్యా! నేను బుద్ధిడిలా, నాసంసారాన్నే త్యజించి వెళ్ళిపోతున్నానా?' అని అడిగాను ఖచ్చితంగా.

'వెళ్ళా లంటే వెళ్ళనూ వెళ్ళొచ్చు. అదెంతభాగ్యం. పదేశి రోజులు, ఇల్లూ వాకిలీ అని లేకుండా క్యాంపులు కొట్టేవాళ్ళు సంసారాన్ని మాత్రం త్యజింపలేరూ? కాకుంటే ఆ బుద్ధదేవుడు లోకం కోసరం సంసారాన్ని త్యజించాడు. మీరేమో......' అని నవ్వింది.

'ఊఁ......అదేదో శెలవిచ్చా'...అన్నాను.

'ఏముందీ...ఏ అనాథ బాలికకోసరమైనా త్యాగంచేస్తారు' అంది రాజ్యం సందేహం, జంకూ, గొంకూ లేక.

కోపం రావడానికిబదులు నాకు నవ్వొచ్చింది. గభాలున రాజ్యాన్ని పట్టుకొని మంచంమీదికి చేదుకొన్నాను.

'ఏ మన్నావురాజ్యం?' అంటూ ఆరోజున రాజ్యం నన్ను విసిగించినందుకూ, నాపై నిందమోపినందుకూ శిక్షగా, కసికొలదీ ఆమె రెండుబుగ్గలూ కొరికి పారేశాను.

'కోపం అంతా తీర్చుకొన్నారా?' అంది నవ్వుతూ రాజ్యం, బుగ్గలు తడుముకొని.

'ఇంకా లేదు' అన్నాను రాజ్యం ఆనంద నేత్రాలలోనికి చూస్తూ.

'పాపం' అని రాజ్యం, పమిట సర్దుకొంటూ మంచం దిగిపోయింది. నేనుకూడా రాజ్యం వెనకాలే దిగివెళ్ళి ఆమెను టేబిలు పక్కకుర్చీపై కూలవేసి, ఆమె పక్కకుర్చీలో నేనూ చదికిల పడ్డాను.

'ఇవన్నీ ఎందుకు తెచ్చినట్టూ?' అంది నాముఖంకేసి చూసి.

'మనం తినడానికి' అన్నాను.

'అంతేనా, నేను ఎల్లాగా వెళుతున్నానుకదా, ఈ పెళ్ళాం ముఖాన్ని ఇంత మిఠాయిపడేసి, కళ్ళనీళ్ళు తుడిసి, మరీదాటుదాం అని ఈ మిఠాయీ ఈ పళ్ళూ తెచ్చారేమో అనుకొన్నాను' అంది రాజ్యం.

నిజంకూడా అంతే. నేను ఊరువెళ్ళడమంటే, అసలు సహించ లేదు రాజ్యం. అంపులో వెధవది, పది పదిహేనురోజులు పడిపోతూం టుంది క్యాంపు. ఇంటివద్ద ఒక్కర్తె రాజ్యం—పిల్లలూను. పనివాళ్ళు ఉన్నారు. ఉంటేం వాళ్ళున్న దారివేరు. యజమాని ఉన్నాదారివేరు. మా పెదబావమర్ది గోపాలం మా ఇంటివద్దే ఉంటూ కాలేజీలోచదువు కొంటూ, వాళ్ళ అక్కకు కాస్త ఆసరాగా వుంటున్నాడు గాని, శెలవులైనందు వల్ల, వాళ్ళ ఇంటికి నర్సాపురం వెళ్ళాడు. ఈ క్యాంపు తగులుతుందని తెలుస్తే, అసలు వాణ్ణి ఆపు చేసేవాణ్ణే. తీరావెళ్ళాడు. వాడేవస్తాడులే అని ఊరుకున్నాను. నా ప్రయాణంకూడా తప్పని సరి అయ్యింది. ఇంక రాజ్యం ఎల్లాను పేచీ పెడుతుందని, ఆమెను కొంచెం సంతృప్తి పరచడానికనీ, ఆ చీరా, ఆ తినుబండారాలు తెచ్చినమాట వాస్థవం.

'గవ్వలు నీ కిష్ట మని తెచ్చాను' అన్నాను నేను.

'ఇవీ నా కిష్ట మనే తెచ్చారా?' అంటూ మెత్తని పకోడీలు తీసుకొని నోట్లో వేసుకొంది. అవి నాకు ఎక్కువప్రీతి అని ఆమెకు తెలుసు.

మే ముభయులం ఫలహారం చేస్తూన్నాం.

'అదిగో ఆ చీరె చూశావా రాజ్యం?' అన్నాను, బీరువా మీాద వ్రేలాడే చీర చూపిస్తూ.

'ఆ. ఇదివరకే మీారు సామానంతా ఇంట్లో సర్ది స్నానానికి వెళ్ళినప్పుడే చూశాను. జార్జెట్టుసిల్కుచీరెల్లో, ఇవి క్రొత్త పేట్రన్ పాప్లెయిన్నూ కదండీ?' అంది రాజ్యం మహా తెలిసిఉన్నదానిలా, పెద్దగ్రుడ్లు తమాషాగా త్రిప్పుతూ.

'ఏమో, ఆ పేట్రన్స్ అన్నీ నాకు తెలీవుమరి. నువ్వంటే అప్టుడేట్‌గరల్‌వు కాబట్టి, ఆ ఫేషన్సు వాటిపేరులూ నీకు తెలు స్తూంటాయి' అన్నాను నేను.

'అంత తెలీనివారేకాబోలు అంత అందమైనచీర ఏరి కోరి తెచ్చారు' అని ముక్కూ ముహం అంతా తిప్పుకుంటూ అని, చీరకోసరం లేచి వెళ్ళబోతూంటే రాజ్యం చీరచెరగు పట్టుకొన్నాను.

'నేను స్వయంగా ప్యాసుచేసి చీరను కొన్నానా? ఎవళ్లో స్కూల్సుఇన్స్పెక్ట్రెస్సు అట—నేను బట్టలు తీసి చూస్తూంటే ఆవిడ పుకే తానూ బట్టలు కొనుక్కోడానికి వచ్చి, యీచీర సెలెక్షన్ చేసింది.

'అల్లా చెప్పండి మరి. మీకు ఎక్కడికి వెళ్ళినా, ఏ కాలేజీ గరల్లో, ఏ మిస్సో—అథమా ఏ నర్సన్నా తగులుకుంటూనే ఉంటుంది. పాపం! ఆ ఇన్సుపెక్టర్ ఆఫ్ స్కూల్సు ఉందని, గొప్పకైనా ఈ చీర కొన్నాకే నాకు' అన్నాది రాజ్యం మరల చెంగు విడిపించుకోబోతూ?

'ఉట్టి అనుమానం దానివి నువ్వూ' అన్నాను కొంచెం కోపంగా.

'సరేలెండి, చెంగు విడవండి చీర తీసుకువస్తాను...' అంది రాజ్యం.

'విడవడానికి వీలులేదు. కావలుస్తే, వెళ్ళు......' అన్నాను కొంటెతనంగా.

'పోండి. నా కా చీరె అక్కరేలేదు' అని వచ్చేసి మరల యథాస్థానాన్ని యుపవిష్టురాలైంది రాజ్యం.

'నేను తెల్లవారుఝామునే వెళుతూన్నాను. ఒక్కవారం రోజుల్లో తిరిగి వచ్చేస్తాను' అన్నాను.

'ఎప్పుడంటే రాండి. నా కేం కావాలి. గోపాలమైనా లేదు. వాళ్ళూ వీళ్ళూ ఎందుకుంటారు నా ఖాదస్తం కాని...' అంటూ చురచురా చూసింది రాజ్యం నా ముఖం కేసి.

‘రాజ్యం! ఎందుకు నీకు భయం. మంచి తెలివైనదానివి ఆమాత్రం ధైర్యంగా ఉండలేవూ?’ అని అన్నాను నేను.

‘ధైర్యం లే కేం. మీకొంటివేషాలు చూస్తూంటే నాకు అధైర్యం పుడుతూంటుంది’ అంది రాజ్యం.

‘ఏం రాజ్యం! ఏమిటీ నువ్వన్నాది. నా కేం అర్థంకాలేదు’ అన్నాను నిజంగా నాకు ఆమెమాటలు అయోమయంగా ఉండి.

‘ఇద్దరుబిడ్డలు పుట్టి, ఇన్నేళ్ళు వచ్చాకకూడా, ఈ కొంటి వేషాలు మీరు మానలేరుకదా అనే నాకు బెంగగా వుంటుంది’ అంది రాజ్యం నెమ్మదిగా.

‘ఏం కొంటివేషా లేంటి?’ అని ధీమాగా అడిగాను రాజ్యాన్ని.

‘అవే పోకిరీవేషాలు’ అంది చటుక్కున రాజ్యం, ముఖం ఎఱ్ఱగా చేసుకొని.

‘పుట్టె అనుమానంమనిషి వై పోతున్నావ్ నువ్వు అంత కంతకీ. నా కోసరం, అక్కడక్కడా పడుచుపిల్లలు పడుగాపులుపడి కూచున్నా రనుకొన్నావేం?’ అన్నాను కొంచెం కటువుగా.

‘ఆ, ఏలినవారు తలుచుకొంటే ఏం లోటా’ అంది రాజ్యం.

‘పిచ్చిరాజ్యం! నువ్వంటే పడిచచ్చిపోతానుకదా నేనూ, అల్లాంటివాణ్ణి పరాయిస్త్రీముఖం చూస్తానని ఎల్లాదురభిప్రాయంపడ్డావ్?’ అని అడిగాను.

‘ఆ. ఏదో సామెత చెప్పినట్టుంది. వెనుకటికి మీయంటి ప్రియులే, ప్రియురాలికి ఉత్తరం వ్రాస్తాడట- ‘ఓప్రియా! నీవే నా జీవనసతివి. నీవు తప్ప నా కీ ప్రపంచంతో పనిలేదు. నీవు కోరినచో గభీరజలనిధిలో దుముకమంటే దుముకుతాను, భయంకారకలాగ్నిజ్వాలల్లో ఉరుకమంటే సిద్ధంగాఉన్నాను, వలయుచో నాప్రాణాలుకూడ తృణముల్లా భావించి నీకర్పిసాను. అందుచే నాపై పరిపూర్ణకటాక్షముంచి

కురిసన్నురాలవుకమ్మా. ఈరాత్రి సుమారు తొమ్మిదిగంటలకు వర్షం కురియకపోతే మీామేడకు వస్తాను' అని అల్లాంటిప్రేమ మీాది అంది రాజ్యం.

రాజ్యంచెప్పిన ఆ సామెతకు ఇద్దరం ఒక్కనిమిషం వరకూ నవ్వాం.

'ఎంతపని చేస్తాడూ, ప్రాణాలను ఇచ్చి ఆ ప్రియుడికి వర్ష మంటే భయంకాబోలు' అంటూ నేను గభాలున, రాజ్యంమీాద ఆక్రమించి ఆమెను నా స్వాధీనం చేసేసుకొన్నాను. ముద్దులు ప్రతి ధ్వనించాయ్.

'ఏమండీ! మీారు భీమాకంపెనీ ఏజంటుగా ఆవూరావూరు వెళ్ళి యెక్కడ బసచేస్తూంటారూ?'

'సాధారణంగా సిటీలైతే పెద్దపెద్దహోటల్సులోనూ, ఏసాధా రణపుఊళ్ళో అయితే రహదారీ బంగాళాలలోనూ......'

'అయితే హోటల్సులోనూ, యీా బంగాళాలలోనూ వ్యభి చారిణు లుంటారంట-మన ఇంటిప్రక్క ప్లీడరుగారి చెల్లెలు కామమ్మ చెప్పటం-నిజమేనా?'

'కామమ్మా! సరేలే, ఆమె కెప్పుడూ యీాగొడవలే. అదంతా వృట్టిది. ఈరోజుల్లో అందరూ ఇల్లాంట్రేడే. తెలిసిందా? అథవాఎవరైనా వుంటే వాళ్ళజోలికీ సొంటికీ నాయంటివారు పోనేపోరు.'

'ఇవన్నీ నాకు తెలీవు. అల్లాంటి కర్మకర్తలు పడనని మన బాబ్జీమీాద ప్రమాణం చేయండి'

'అల్లానే' అన్నాను అతి కష్టంగా.

వలపుతో ఆదరించింది నన్నప్పుడు రాజ్యం.

# ౨

'ఇదోయ్ రంగం, నాకూ రాజ్యానికీ ఆ రాత్రి జరిగిన సంభాషణ' అని నేను నా బాల్యమిత్రుడైన సర్కిల్ ఇన్‌స్పెక్టర్ రంగనాథానికి, అంతా పూసగ్రుచ్చినట్లు ముందుగా చెప్పాను. ఇద్దరం ప్రాణస్నేహితులం. మా సంభాషణలలో పడకటింటిరహస్యాలుకూడ వస్తూవుంటవి.

'ఎగ్జాక్ట్లీ, ఆనంద్! మా ఇంటిలోనూ అస్తమానూ ఇదేగొడవ. మా ఆవిడకూడా వృట్టి అనుమానంమనిషే. పైపెచ్చు మీారు ఎవరికైనా ఇన్‌స్పెక్టర్లు కాని, ఇంట్లో చేసుకున్నా పెళ్ళానికి, కన్నా బిడ్డలకూ ఇన్‌స్పెక్టర్లా—అటుంది. నిజానికి ఆమెను చూస్తే, నేను కొంచెం జంకుతానుకూడాను.'

మే మిద్దరం నవ్వుకున్నాం.

'ఆమె గినా మన సంభాషణ వింటే మనల నిద్దరినీ పట్టుకు బాదుతుందేమో!' రంగనాథం నవ్వాడు.

అప్పుడు నేను రంగనాథంగారిఇంటిలోనే ఉన్నాను. కాకినాడ, సూర్యారావుపేటలో పంపులచెరువుకు ఎదురుగావున్న మేడలోనే వుంటూవున్నాడు రంగనాథం.

పగలు పదకొండుగంటలకు భోజనం ముగించి, రంగనాథంతో మాట్లాడాలని వెళ్ళాను. అతనూ భోజనం అప్పుడే ముగించి తాంబూలం సేవిస్తూన్నాడు. నేను వెళ్ళగానే అతనూ నేనూ కలసి మేడమీాద తూర్పువైపుననున్న పెద్దవరండాలో నున్న పడకకుర్చీలలో కూర్చుండి కులాసాగా కబుర్లుమొదలుపెట్టాం.

'ఇవ్వాళ నీతో పనిఉండి మరీవచ్చాను రంగం'

'అల్లానా; ఫస్టు బిజినెస్సు దెన్ హ్యాపీ టాక్ (ముందు వ్యాపారం, తరువాత కబుర్లు) ఉ, సంగ తేమిటో చెప్పు ఆనందం?'

'క తేమిటంటే,—మా రాజ్యం అనుమానంపడినట్లే నాకూ ఒకసంఘటన సందర్భించింది.'

ఉ హూ! అయితే ఏదో ఛాన్సు కొట్టావన్నమాట!'

'ఆ! ఛాన్సులానే ఉందోయి! ఆ అమ్మాయి ఏ ముహూర్తాన్ని నా కళ్ళల్లో పడిందో కాని, నా మనస్సంతా శుభ్రంగా పాడైపో యిందోయ్ రంగం!'

'ఆనంద్! ఆ సంగ తేమో త్వరగా చెప్పు. ఆతృతతో చచ్చి పోతూన్నాను. ఊ. కానీ ఇదిగో సిగరెట్టు!' ఇద్దరంవెలిగించాం సిగ రెట్లు. నేనూ సిగరెట్టుకాలుస్తూ కథ ఏవిధంగా మొదలుపెట్టనా అని ఆలోచిస్తూన్నాను. నా దృక్పథాన్ని, సిగరెట్టు పొగ సుడులు సుడులుగా తిరుగుతూ ఎక్కడికో పైకి ప్రయాణంకడుతూంది.

'సరే మీరాజ్యం నిచేత ప్రమాణకంచేయించుకొని మరీ ఊరు వెళ్లనిచ్చింది. నువ్వు ఆ తెల్లవారుగ్ఝామున ఊరికి బయలు దేరావ్—ఉ— తరువాత......'

'నేను మొదట్లో రామచంద్రపురం వెళ్ళి అక్కడి ఎల్. ఎఫ్. బంగాళాలో క్యాంపు వేశాను. ఆ పవలు నా అసిస్టెంటూ వాళ్ళూ వస్తే ఏదో బిజినెస్సు చూచుకొన్నా. తరువాత ఆ రాత్రి నా ఆలో చనలన్నీ విపరీతంగానే ఉన్నాయ్. కామమ్మ నా భార్యకు చేప్పే సంగతులూ, రాజ్యం నాచేత ఒట్టుపెట్టించుకోవడం అంతా జ్ఞాపకానికి వచ్చాయ్. మనస్సు దుర్బలత్వంకూడా చెందింది. ఊహాప్రపంచంలో సుందరకన్నియల నెందరినో సృష్టించి చెలగాట లాడాను. పర్యవ సానం — నిద్రదండుగా, నిరర్థకమైన ఆలోచనలూ. ఎల్లాఅయితేం ఆ రేయి తెల్లవారింది. మరల మామూలుబ్రతుకే. వెధవవ్యవహారం

గొడవల్లో మునిగిపోయాను. ఆ విధంగా అక్కడ వారంరోజులు క్యాంపువేశాను. తరువాత మఖాం అక్కడనుండి ఎత్తివేసి కోటిపల్లి వేయాల్సివచ్చింది.

ఆ రోజున నేను అంత కులాసాగా లేను. కాస్త తలనొప్పిగా కూడా ఉంది. ఆ సాయంకాలం రామచంద్రపురంనుంచి కోటిపల్లి ట్రెయిన్‌మీద వెళ్ళాను. కోటిపల్లిలయిన్ ట్రయిను కట్టివెయ్యడానికి అది ఆఖరి రోజయినందున సర్దాగా ట్రయినుమీదే కోటిపల్లి చేరుకున్నాను. సుమారు ఏడుగంట లయింది అప్పటికి. సామాను కూలీవానిచే పట్టించుకొని వెళ్ళి, కాలువ ఒడ్డుననున్న రహదారీబంగాళాలో క్యాంపువేయడానికి, ఆ బంగాళాదగ్గరకు వెళ్ళేను. అక్కడ వాచరు లేడు. ఆ కూలివానిని పంపి వాచరును పిలిపించాను.

'ఏమోయి రామయ్యా?' అన్నాను కొంచెం చిరాకుగా.

'చిత్తం బాబయ్యా!' అన్నాడు రామయ్య.

రామయ్యాను నాకు తెలుసును. ఇదివరకు సంవత్సరంక్రితం ఈ బంగళాలోనే మఖాంచేసినప్పుడు రామయ్య నాకు చాల సేవ చేశాడు. రామయ్యకు సుమారు ఏభైసంవత్సరాల వయస్సు. మంచి వాడు. గట్టిగా మాట్లాడలేడు పాపం.

'త్వరగా తలుపులు తీసి సామాను సర్దు' అన్నాను.

రామయ్య కంగారుపడుతూ, బెదురుతు వణుకుతూ తాళాలు తీసి సామాను లోన సర్దాడు.

నేను కూలివానికి డబ్బిచ్చి పంపేశాను.

'ఆ పడకకుర్చీ ఇల్లా ఎదర వరండాలో వెయ్యి' అన్నాను రామయ్యను. రామయ్య వెంటనే కుర్చీ దుమ్మూ గట్రా దులిపి, వరండాలో వేశాడు.

నే నా కుర్చీలో కూలబడి సిగరెట్టు ముట్టించాను.

'ఏమోయ్ రామయ్యా! నన్ను మరచిపోయావా ఏం?' అన్నాను క్రీగంట చూస్తూ రామయ్యను.

'తమవంటి మహారాజుల్ని మరచిపోతానండీ బాబూ? తమరు ఆనందరావుబాబుగారు కదండీ' అన్నాడు సందేహంగా రామయ్య.

'అవునోయ్ రామయ్యా! నువ్వు సరిగ్గా గుర్తుపట్టగలిగావే!' అన్నాను ఆశ్చర్యంగా.

'పదిరోజు లున్నారో లేదో అయినప్పటికీ బహుమతీ ఇచ్చారే, ఆమాత్రం జ్ఞాపకం ఉండదండీ రక్షించేవారు' అన్నాడు రామయ్య సగర్వంగా.

'అయితే రామయ్యా!......' అని ఆగిపోయాను. రామయ్యకు కూతురున్నట్టు చటుక్కున జ్ఞప్తికివచ్చింది. ఆ అమ్మాయిని క్రితసంవత్సరం సూజాయిగా చూశాను. మంచివయస్సులో ఉంది అప్పుడు. చామనచాయ అయినా చలాకీగా ఉంటుందేమో, అంత ఫరవాలేదు-అందగత్తెలలో లెక్కే.

'బాబూ స్నానం గటా్రి......' అన్నాడు రామయ్య.

'స్నానంచేసే భయలుదేరేనులే. ఇప్పు డిహ చేయను. ఇంక భోజనం అంటావా? తల కాస్త నానుగా ఉంది. ఆకలికూడా అంతగా లేదు. ఏవో పళ్ళూ, కొంచెంగా కాఫీ తాగి, యీ పూటకు భోజనం మానేస్తాను' అన్నాను.

'అయితే కాఫీ తెచ్చేదా బాబూ?' అన్నాడు రామయ్య.

సరే ఎందుకైనా మంచిది. ముందు రామయ్యను బజారుకి పంపుదామని అనుకొన్నాను.

'ఇదిగో రామయ్యా! ఒకడజన్ బత్తాయిలూ, ఒకడజన్ తెల్లచక్రకేళీలూ తీసుకో. కాఫీ ఫ్లాసుకు-నిండా పోయించుకో. ఇదిగో రూపాయితీసుకొనివెళ్లు. లోన సామానులో కాఫీఫ్లాసుకు ఉందికదూ?' అంటూ చొక్కాలోంచి ఒకరూపాయి తీసి రామయ్య కిచ్చాను.

రామయ్య లోనికి వెళ్ళి గ్లాసు- తీసుకొని బజారుకి సిద్ధమయ్యాడు.

'ఏయ్ రామయ్యా! మరి ఒక గోల్డుఫ్లేక్ సిగరెట్టుపెట్టికూడా తీసుకో' అన్నాను వెళ్ళే రామయ్యను.

'చిత్తం' అన్నాడు రామయ్య వెళ్ళుతూ.

'రామయ్యా!' అన్నాను మరల.

వెళుతూన్న రామయ్య మరల వెనుకకు వచ్చాడు. నేను ఆలోచనలో పడటంచూచి—

'ఏం బాబూ?' అన్నాడు.

'రెండు కిళ్ళీలుకూడా కట్టించుకురా!' అన్నాను పరధ్యానంగా.

'సరే నండి' అంటూ రామయ్య వెళ్ళిపోయాడు.

రామయ్య వెళ్ళిపోయినప్పటినుంచీ నాలో విచిత్రమైన భావ ఘటశభోగాలు పై కెగబ్రాకాయి. ఒడలంతా ఝల్లుమంది.

'రహదారీ బంగాళాల్లో వ్యభిచారిణు లుంటారు' అన్నా రాజయ్యమాటలు నాకు వినపడుతూనే ఉన్నాయి. అప్పుడే క్యాంపు వచ్చి వారంరోజు లయింది. మనస్సంతా మోహంతో నిండిపోయి ఉంది. కామోద్రేకుణ్ణై పెరతోవలు త్రొక్కి-దా?

సంవత్సరానికి మరల రామయ్యకూతురు నాకళ్ళల్లో కట్టినట్లుంది. ఇంతదుర్బలత్వం పనికిరాదని అనుకున్నాను కాని, నిగ్రహించలేకపోయాను. ఇంతమాత్రమేనా సాహసం అని నా అంతరాత్మ నాకొకవైపున బోధిస్తూనే ఉంది.

రామయ్య పళ్ళా కాఫీ తెచ్చి లోన పెట్టాడు. బంగాళాలోని కుండతో కాల్వలోని నీరు ముంచుకొనివచ్చి సావిట్లోనే ఉంచాడు. మిగిలినడబ్బు నాకిస్తూ— 'ఆనందరావ్ బాబుగారూ ఒకటిమనవి...' అంటూ నిలబడ్డాడు నామ్రోల

'రామయ్యా! నీ కొకకూతు రుండాలికదటోయ్' అన్నాను, ఎందు కడుగుతూన్నానో నాకే అర్థంకాక.

'చిత్తం బాబూ. నాకు కమల అనే కూతు రుండేదండి. బాబయ్యగారు, మా అమ్మణ్ణి చూడనే లేరు....' అన్నాడు రామయ్య.

'చూడ కేమోయ్. మీ ఇంటికి తాగాలకోసరం వచ్చి, మీ అమ్మాయిని చూశాను. చాల బాగానే ఉంటుందిలే' అన్నాను రామయ్యను పరీక్షిస్తూ.

'చిత్తం బాబయ్యా! ఈ బంగళాలోకి ఏ సాములు వచ్చినా సరే మా అమ్మాయిని మెచ్చుకోని వారు లేరండి. ఒకప్పుడు మాత్రం ఒక [illegible] [illegible] [illegible], ఆయన ఒకరోజు, మా అమ్మాయి ఇష్టపడ్డా గిల్లునిచ్చానుకాను ఆయన ఉన్నా ఆ రెండు నెలలుగాను.'' అన్నాడు రామయ్య.

'అల్లాగా' అన్నాను ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ.

'భగవంతుని పుణ్యమాంటూ మా అమ్మణ్ణికి ఒక ఆడకూతురు కలిగిందండి...' అన్నాడు ఉప్పొంగుతూ రామయ్య.

'ఓహో మంచిదాస్తే' అన్నాను ఆనందం అభినయిస్తూ.

'ఆ చంటిబిడ్డ, మా ప్రాణముచ్చటగా పెరుగుతుండే, కమలను, మొగుడు వచ్చి వాళ్ళింటికి తీసుకొని వెళ్ళిపోయాడండి...' అన్నాడు రామయ్య.

'ఆ! ఏమిటీ మీ అమ్మాయి ఇప్పుడు ఇక్కడ లేదూ?' అన్నాను కంపితకంఠంతో.

'మొన్ననే వెళ్ళిందండి అత్తవారింటికి—అంతా మూడు రోజులౌతుందండి' అన్నాడు రామయ్య.

'ఆ వెళ్ళిపోయిందా కమల?' అని నేను, కలతమనస్సుతో నన్నే ప్రశ్నించుకొన్నాను.

ఇద్దరం రెండునిమిషాలు నిశ్శబ్దం.

'ఇంక నువ్వు వెళ్ళులే రామయ్యా' అన్నాను హఠాత్తుగా నేను.

'ఒక్కరూ ఉండటం ఇంతబంగళాలో జాగ్రత్త సుమండీ బాబయ్యా' అంటూ రామయ్య వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళి పోయాడు.

వెళుతూ వెళుతూ రామయ్య నన్ను ఒంటిరిగా ఉన్నందుకు హెచ్చరించి మరీ వెళ్ళాడు. అంతభయపడవలసినవిశేషం ఏ ముంది?

ఈవిధంగా ఆలోచించుకొంటూ ఆ పడకకుర్చీలో అల్లానే పడుకుండిపోయాను చాలసేపు. ఆతరువాత మనస్సు స్థిమితంలేక, ఇంటిపై ధ్యానంపారీ, సిగరెట్టు కాల్చుకొంటూ ఇటూ అటూ పచారు చేస్తూన్నాను. ఒక్క సారిగా బాబ్జీ, చిట్టీ, రాజ్యం జ్ఞాపకంవచ్చారు. అదేంవింతో కాని, రాజ్యం నేను వచ్చేసేటప్పు డిచ్చిన హెచ్చరిక కూడా జ్ఞాపకానికి వచ్చింది. అంతటితో మరల ఆకాశపథాల వింత వింతసౌధాలు నిర్మించడం మొదలుపెట్టాను.

వస్తుతః మనిషిలో దుర్బలత్వం ఉంటే, అది సమయం చిక్కి నప్పుడు బాధిస్తూనే ఉంటుంది. సమయం అనేది స్థిరమైన వ్యక్తినే పాడు చేసేస్తుంటుంది. అల్లాంటప్పుడు, దుర్బలుడైన వ్యక్తి అదునుదొరికితే పాడైపోడూ? నాలో నోకాస్తంత మెతకదనం ఉండడంచేత, నాకు స్థిమిత మనేది లేకుండా పోయింది. అంతమట్టుకే. చివరకు సాహసం సున్న. క్రియహుళ్ళక్కి. చెడిపోవడానికి తగినంతవరకూ తెగించ లేదు ఇంకా నాబుద్ధి.

ఇల్లాంటి దుర్బలత్వం ఏ తెగకు జేరుతుందో మాత్రం నాకు తెలీదు. ఇది ప్రణయతపస్సా? వ్యభిచారదోషమా?

రాత్రి సరిగ్గా పదిగంటలయింది. తలనొప్పి కొంచెం ఎక్కు వయ్యిందే కాని తగ్గలేదు. ఆకలి అంతగాలేదు కాని, రెండు బత్తా

యిలూ కాస్త కాఫీ తాగి, పండుకొందాం అని అనుకొని, బంగాళాలోనున్న గదిలోనికి పోయి రెండుబత్తాయిపళ్ళు తీసుకొని, ఒలుచుకొని తిందా మని మరల వీధి వరండాలోకి వచ్చి, నా పడకకుర్చీలో కూర్చున్నాను.

నెమ్మదిగా చినుకులుపడటం ప్రారంభించాయి. వర్షం సాగింది. అమావాస్యరోజు లవ్వడంచేత చీకటికూడా దట్టంగానే అల్లుకొంటూంది ప్రకృతిసంతటా. ఆ వరండాబయ టుండటం కొంచెం కష్టం అనిపించింది. వేవేగం పళ్లుతినేసి పడకకుర్చీ లోన పడేద్దా మని లేచాను. ఇంతలో చప్పుడయింది. పరికించి చూశాను. ఆ చీకటిలో నా కేం దృగ్గోచరమవ్వలేదు. ఇంతలో ఒక్క మెరుపు మెరిసింది. కళ్లు చిరతలు గ్రమ్మినట్లయ్యాయి. దేహమంతా పులకరించింది. ఆశ్చర్య చకితుడనై పోయాను. నిశ్శబ్దప్రణయతాపసినై, అల్లానే రెండు గుడ్లప్పగించి నిగుడ్చి నిలబడిపోయాను - నాదృక్పథాన్ని పడింది ఒక చక్కని చుక్క--బంగారుబొమ్మ-పదహారేండ్ల బాలాకుమారి.

## 3

'ఇప్పుడు కథ రక్తికట్టిందోయ్ ఆనంద్' అన్నాడు రంగనాథం, నేను కోటిపల్లి, రహదారీబంగళాలోజరిగిన సంగతినే ఆతనికి ఏకరువుపెడుతూంటే. రంగనాథం అన్నామాటకు సమాధానంగా ఒక్క చిరునవ్వు నవ్వి మరల నా కథ నేను ప్రారంభించాను.......

ఆ మెఱుపులో నాకు దృగ్గోచరమైనదృశ్యం—భ్రమా? నిజమా? అను సందేహం వచ్చింది. ఆ క్షణాన్నే రామయ్యగారితుదు కమల కూడ జ్ఞాపకంవచ్చింది. అయితే కమల అంత అందవిహీనురాలుకాని

సాధారణపు పిల్లైనా, ఇప్పుడు నేను చూచిన అమ్మాయికి ఏ విధంగా కూడా పోలదు. ఆ మెఱుపులో ఆమె ఒక స్వర్ణకాంతి ప్రకాశించి నట్లు ప్రకాశించింది. అందుచే ఆమె కమల కాదని నిర్ధారణ చేసుకొన్నాను.

ఈ విధంగా మెఱపు మెరసి ఆ అమ్మాయి కనపడడం, నే నీ విధంగా ఆలోచించుకోవడం, ఆ వచ్చిం దెవరా అని కుతూహలంతో నేను వరండా దిగి వెదకటం, అన్నీ ఒక్క-నిమిషంలోనే జరిగిపోయ్.

ఇంతలో కొంతశ్రమ తగ్గించడానికో అన్నట్టు మరో మెఱుపు మెరిసింది.

ఒకళ్ళకు ఇద్దరు కనపడ్డారు. ఆ రెండవవ్యక్తి చూడ్డానికి చెడ్డ భయంకరంగా ఉంది. ఆమె ఒకముసలిది. ముఖంలోనే మూర్తీభవిస్తుంది ఆమెకుటిలత్వమంతా. ఆ అమ్మాయి ఎంత సాధువులా కన్పడిందో, ఆ వృద్ధురాలు అంత భయంకరపిశాచిలా కన్పడింది.

'ఎవరు బాబూ?' అను ఆమె కఠినకంఠస్వరం, బంగాళా అంతా ప్రతిధ్వనించింది.

నే నంత వెంటనే జవాబు చెప్పలేను, నేను స్థాయిగా మాట్లాడ దలచుకొని వరండామీదకు ఎక్కాను. వాళ్ళూ న నన్ననుకరించారు.

'ఎవరు బాబూ?' అంది ఆ ముసలిది.

మాట్లాడడానికి నా గొంతుముడి విడివడలేదు. నా హృదయం వేగంగా కొట్టుకొంటూంది. ఆ వృద్ధురాలు నన్ను అతిగభీరంగా పరీక్షిస్తున్నట్లు తోచి, నాకు యొడలు ఝల్లుమంది.

ఇంక ఆ అమ్మాయివిషయం—ఆమెను చూచినంతనే విద్యుచ్ఛక్తి నా శరీరంలో ప్రవేశించినట్లు, ముమ్మరమైన మోహాముచే వివశుణ్ణై పోయాను. నా హృదయంలోనూ, నా దూరదృష్టిలోనూ ఆమె రూపం శాశ్వతంగా స్థాపింపబడిపోయింది. నిదానించగా, ఆ సుంద

రాంగి ముఖం ఆమె భయోద్రేకమై యున్నట్లు ఆ ముఖకళవళికలే స్పష్టీకరిస్తున్నాయి. ముద్దులుగట్టే ఆ ముఖానికి కష్టాలుపెట్టా డా భగవంతు డనిపించింది నాకు.

నేను వా రిద్దరినీ చూశాను. వారూ నన్ను నిదానించి చూశారు. మొదట్లో ఆ అమ్మాయి నన్ను చూచి మరీకంగారుపడిపోయింది. క్రమీాపా ఆమె తేరుకొన్నట్లు కనుపించింది. ఆ విశాలాక్షులలో ఆనందం ప్రకాశిస్తోంది. ఆమెముఖంకూడ ప్రకాశవంతమైంది క్రమంగా. ఆమె కొకవిధమైన ధైర్యం, సంతోషం కన్పడినట్లు ఆమెముఖవర్చస్సే చాటుతూంది. ఈ మార్పులకు నా హృదయం కూడ ఆనందంతో గంతులువేశింది.

ఇంక—ముసలిఅవ్వ నన్ను చూచి క్రమీాపా కృంగిపోయింది. ఆమెమోము వాతాహతమైన పుష్పంలా, ఆక్షణాన్నే కుంచుకొనిపోవడం చూస్తే నాకు చాల ఆశ్చర్యంవేశింది.

'అమ్మా! మీా రెవరూ?' అని ప్రశ్నించాను కరుణకంఠంతో.

'మేం శ్రీవైష్ణవులం' అని సమాధానమిచ్చింది ఆ ముసలిఅవ్వ.

ఏ కులమో ఎవ రడిగా రని ఆ అవ్వ మేం శ్రీవైష్ణవులం అని చెప్పింది అని అనుకొన్నాను. ఆమె నాక్షేపిస్తూ మేం బ్రాహ్మణులం అని చెప్పదామనుకొన్నాను కాని, బాగుండదని ఊరుకొన్నాను. మరోవిషయం నా బుఱ్ఱకు తట్టింది.

'శ్రీవైష్ణవులా?' అని మనసులో అనుకొన్నాను.

'అయితే మామ్మగారూ! ఈ అమ్మాయి ఎవరండీ?' అన్నాను చుట్టరికం నెమ్మదిగా కలుపుత

'మా మనుమరాలేనం[illegible] [illegible]ది ముక్తసరిగా.

'మామ్మగారూ! పాపం మి[illegible]లు. ఆ అమ్మాయా—చిన్నపిల్ల. మీా రిద్దరూ ఇల్లా ఈ వర్షంలో తడిసిపోయి, వణకటం

చూస్తే, నాకు చాల విచారంగా ఉంది. మరేం అనుకోకుండా, నా యం దనుగ్రహించి, నా దగ్గర కంబళివా లున్నాయ్—అవి చుట్ట బెట్టుకొంటే నేను చాల ధన్యుణ్ణి.' అన్నాను వినయం, ఆత్మీయత గొంతువెంట కుమ్మరిస్తూ.

ఆ పడుచుపిల్లకూడ నా ఆదరణకు కళ్ళతో కృతజ్ఞత చూపింది.

'అయ్యో! నాయనా!! మీరు చాల యోగ్యులులా ఉన్నారు. అందుచేతనే, ఇలా వర్షంలో తడిసి, ముద్దైపోయా మని మా యం దింత సాదిరణ చూపారు. అదే పదివేలు. కాని, మేం ఇంకా ఈ వర్షంలో తిరగాల్సిఉంది. అంచేత మీ యుడుపులు అఖ్ఖరలేదులేండి' అంది నా మనస్సు నొవ్వకుండా.

'ఆ. అయితే మామ్మగారూ! మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారూ? ఏంటి సంగతి?' అని గ్రంథంలోకి దింపుతూ ప్రశ్నించాను.

ఏ విషయమైతే చెప్పడానికి, ఇంతవరకూ శంకించుతుందో, ఆ విషయాన్నే ముసలిదాన్ని నొక్కిఅడిగేసరికి, ఆమె కంగారుపడింది.

'మాది ఈ వూరే నాయనా! మా మనుమడు నా మీదా మా అమ్మాయిమీద కొంచెంకోపగించి, ఈ రాత్రిసమయాన్ని ఈ వర్షంలోపడి ఎక్కడికో వెళ్ళిపోయాడు. అతను ఒకవేళ, ఈ బంగాళాలోకిగినా వచ్చాడేమో పరుంటాని కని భ్రాంతిచొప్పున నేనూ మా అమ్మాయి వచ్చాం నాయనా!

ఆ ముసలది మాట్లాడుతూన్నంతసేపు ఆ యువతి ఆ అవ్వ ముఖంకేశి తమాషాగా చూస్తూంది.

ఆ వృద్ధురాలు చెప్పినసంగతులువింటే నాకూ అపరిమితమైన జాలి కలిగింది. పాపం, ఆ నిర్దాక్షిణ్యుడు, నిక్షేపంలాంటి పిల్లను విడిచిపెట్టి, ఈ కాళరాత్రి, వర్షమనకా వరదనకా ఎక్కడికి పోయాడోకదా!

అల్లాంటిమూర్ఖులకే ఇల్లాంటి సుందరసుస్వరూపాలు, దొరుకు తూంటారు. భగవంతుడు దాంపత్యాలు ఎన్నిరకాలుగా కూరుస్తూం టాడు. చదువుకొని, కాస్త సంపాదించుకొంటూ ఉన్నవాడికి అల్లాంటి పిల్ల దొరుకుతే, నిజంగా వా డెంతస్వర్గసుఖం అనుభవిస్తాడో కదా? ఏమో ఎవ్వరు చెప్పగలరు? ఈ ముసలిది, ఆ భర్తను ఎంతవేపించు కొనితిన్నదో? ఈ సంగోష చిత్రం ఎల్లాంటిదో? అతడు, విసిగిపోయే విడిచేశాడో?-ఆ వైష్ణవుల అవ్వను సంభాషణలోకి దింపుతే అంతా వెల్లడౌతుంది అనుకొన్నాను.

'మామ్మగారూ! ఇక్కడికి ఇంతవరకూ ఎవ్వరూ రాలేదు. ఒకవేళ వచ్చి, ఈ బంగాళాలో ఎవ్వరో ఉన్నారుకదా అనుకొని మరిఎక్కడికైనా వెళ్ళిపోయాడేమో? లేకుంటే ఏప్రాన్తైనా వెళ్లా డేమో. అయినా ఏప్రాన్తైనా వెళ్ళడానికి, ఇప్పుడు కారులుగాని, రైలుగాని, లేవే. ఇంక ఊళ్ళో మరోచోటున నెక్కడైనా దాగి ఉన్నాడేమో? లేకుంటే ఇంటికే మరల జేరుకొన్నాడో' అన్నాను ఎంతో ఆప్యాయంగా.

'అవును నాయనా అవును. ఇంటికేవచ్చి ఉంటాడు' అంది ముసలిది.

నేనా అమ్మాయిముఖం పరీక్షించి చూస్తే, నిజంగా ఆ సుం దరవదనంలో చింతా చీకూ కనపడుతూనే ఉన్నాయి. కాని మెరు గుడు పురుగుల్లా మెరిసే ఆమెదృక్కులు చూస్తే నా శరీరమంతానీరై పోతూంది. భర్తపై ఈమె కెంతమక్కువఉందా అని పరీక్షించాలని నాకు కొంటెకోర్కె కలిగింది.

'మామ్మగారూ ఒకవేళ, ఈ అమ్మాయి భర్త, పాపం! మంచీ చెడ్డాలేక కోపవివశుడై, గోదావరిలోగినా పడి ప్రాణాలు తీసుకోలేదుకదా?' అన్నాను, గుండె నిబ్బరం చేసుకొని.

'అయ్యో! నాయనా!! ఎంతవిషపుమాటన్నారు?' అంది ఒక్కసారి, పైశాచికంగా ఆవైష్ణవులవృద్ధ. ఆమె ముఖం విషణ్ణమయమైపోయింది.

ఇంక, ఆ సుందరి ముఖలక్షణాలలో మరోవిధమైన మార్పులు గలిగాయ్. ఆమె కన్నులలో కొంతెతనపుకాంతి ప్రకాశిస్తోంది. అందుచే, ఆజవ్వనియొక్క మనోభావము నాకు దురూహ్యమైపోయింది.

అంతకంతకూ వర్షం అధికమైపోయింది. కుంభవర్షం కురిసేస్తూంది.

'అమ్మాయీ! వసంతా!! రా అమ్మా వెళ్ళిపోదాం, అంది అవ్వ-వసంత-పేరు నిజంగా ఆ చిగురాకుబోడి అందానికి తగినట్టే ఉందికదా? అవ్వమాటలకు, వసంత నా ముఖంకేసి చూశింది.

అబ్బెబ్బే వర్షం తగ్గుతేనే కాని మీరు వెళ్ళడానికి వీలులేదు మామ్మగారు!

నేను లోనికి వెళ్ళి నాలుగు బత్తాయిలు తెచ్చి మామ్మగారికి బలవంతంగా ఇచ్చాను.

ఆ వరండాసట్టామీదే చదికిలబడి, అవ్వ, వసంత లిరువురు పళ్ళుతింటూన్నారు.

'మామ్మగారూ; మీ పేరు?'

మహాలక్ష్మమ్మ అంటారు నాయనా!

నీయమ్మకడుపు చల్లగాఉండా, ఏదో కాస్త ఆకలి ఉపశమింపజేశావ్ నాయనా!

నేను లోనికి వెళ్ళి రెండు గాజుగ్లాసుల్లో కొంచెం కొంచెం కాఫీ వేసితెచ్చి ఆ మామ్మకూ అందించాను. వసంతకు కాఫీ ఇచ్చేటప్పుడు, ఆమెచేయి, నాచేతికి తాకేలా మరీ అందించాను. ఆస్పర్శకు, నా రక్తనాళాల్లో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది.

మహాలక్ష్మమ్మ, యీసంఘటన కీగంట కనిపెట్టకపోలేదు. కనుబొమలువిరిచి, వసంతను ఆమె కోపపడడం నేను చూడకాపోలేదు. ఆ చలిసమయాన్ని వేడివేడి కాఫీ ఉండటంచేత, వాళ్ళు వెంటనే త్రాగటం ముగించారు.

వసంత ఆ రెండుగ్లాసులూ కడిగివేసి, సావిడిలోనున్న బీరువాలో పెట్టివస్తూంది. ఆ దీపపుకాంతిలో ఆమె నా కొక జగన్మోహినిలా కనుపించింది.

మామ్మగారూ! వసంతము-మీవసంతను నిజంగా వసంతమేనండీ!

అయితేం, ఏంలాభం నాయనా! ఆ మగడుముండాకొడుకు తిన్నైనవాడు కాకపోవడంవల్ల, దాని అందమూ, దానిజీవితమూ-అన్నీ వృథా అయిపోయాయ్.

'ఇంతమాత్రానికే అధైర్యం పడిపోతారేం? అతనే తిరిగి తిరిగి వస్తాడు. చివరకు దాసోహమని ఆ అమ్మాయి మోకాలవ్రాలి, ఆమె చెప్పుచేతల్లో ఉంటాడు'

'ఏదో నాయనా! నీనోటివాక్యంవల్ల అల్లావాళ్ళిద్దరూ సుఖంగా ఉంటే అదేచాలు పదిలక్షలు.'

'అతను అంతకీ కలసిరాకపోతే-పోనీ; విడాకులే ఇచ్చి పారేయండీ. తరువాత ఆలోచించవచ్చు- విన్నారు? దమయంతీస్వయంవరము-అల్లాగ.

'ఛాల్లేనాయనా! నీసంభాషణ-ఇల్లుకాలిపడుస్తూంటే,గోడెక్కినవ్వారంట-నీబోటివాళ్లే-కోపమువచ్చి పారిపోయిన మనుమడు కనుపింపక దిగులుపడి మేముంటే, నీకంతా వేళాకోళాలు. నీకుపుణ్యముంటుంది, పోనీయ్నాయనా మమ్మల్ని, వర్షంకూడా తగ్గిపోయింది. ఏదో యీముసలిదానిమీద జాలి కలిగి, నాలుగు బత్తాయికాయలు మా

ముఖాన్ని పడేశావు. దానికే మేమెంతో కృతజ్ఞులం. మా బాధనీకేం తెలుస్తుంది. ఇంక సెలవు మాకు' అని మహాలక్ష్మమ్మ నేను వారిస్తూన్నా వినక బిరబిరా వసంతను లాక్కొని తీసుకొనిపోయింది. అలా వెళ్ళిపోతూ వెనుకకు తిరిగి ఒక్కసారి నన్ను జాలిగా చూచింది వసంత మాత్రం అంతే.........

ఊసూరుమంటూ నేను లోనికి పోయి, నా బిచానా పరచుకొని పండుకొన్నాను. అరగంట గడిచింది. గంట గడిచింది. నాకు నిద్రనేది రాలేదు. నా కళ్ళల్లో వసంత కన్పడుతోంది. అంతఅందగత్తె వసంత, యేయదృష్టవంతుని భార్యయౌతుందోయనే నాయాలోచనలు.

ఎవ్వరో తలుపు తట్టారు. మరల తట్టారు. నేను తలుపు తీసేందుకు, కొంచెం వెనుకంజవేశాను. తలుపుతీసే పర్యంతం ఆతలుపు తట్టడం తగ్గేట్టులేదు. అందుచే తప్పనిసరిగా, లేచివెళ్ళి తలుపు తీశాను. నాకు దృగ్గోచరమైన వ్యక్తిని గాంచేసరికి ఆశ్చర్యవిస్మయుడనైపోయాను.

'వసంతా!' అన్నాను తడబడుకంఠాన్న.

వసంత యేమీ మాట్లాడలేదు. ఆమె కళ్ళలో భయచిహ్నాలు దృగ్గోచరమౌతూన్నాయి. ఆమె తనువెల్ల కంపించుతోంది. వసంత నాగదిలో ప్రవేశించి ఆగదితలుపు వేసేసి, ఆగదికొక మూలగా చలిచేతను భయముచేతను గజగజావణకుతోంది. ఆమె మరల వర్షంలో తడిసిపోయింది.

లేతపిల్ల, అనుభవమెరుంగనిముగ్ధ. అసహాయ, అనాశ్రియ— ముఖపద్మం, వర్షబిందువులచే తళతళలాడుతోంది—వస్తుతః సుందరి యేమో ఆమె భయపడినా, నవ్వినా అందంగానే వుంది.

నేను ధైర్యం తెచ్చుకొన్నాను. నెమ్మదిగా ఆమె దగ్గరకు వెళ్లాను.

# ౪

'వసంతా! కట్టుకొనుటకు బట్టలిచ్చేదా?' అన్నాను.

వద్దని ఆమె సంజ్ఞ చేసింది.

'ఏం భయంలేదు. నేను నీ కభయహస్త మిస్తాను. పొడిబట్టలు కట్టుకో, లేకుంటే జబ్బుచేస్తుంది. ఆమూల నిలబడ్డావేమి, యిటురా, యీ బిచానామీద కూర్చుందువుగాని.' అన్నాను ఆప్యాయతగొంతు వెంట గుమ్మరిస్తూ.

'తండ్రీ! నాకేమీ అఖ్ఖరలేదు. మీకు పుణ్యముంటుంది, పొద్దుటవరకూ నన్ను రహస్యంగా యిక్కడవుండ నీయండి.' అంది వసంత కంపితకంఠాన్న.

ఆమె తండ్రీ యను సంబోధన నామీదలెల్ల నీరుగా చేశేసింది. నా తల తిరిగిపోయింది. స్త్రీని వశంచేసుకోవాలంటే యోర్పుండాలి.

'వసంతా! నిన్ను నేను అన్నివిధాలా కాపాడుతాను. నన్ను పరాయివానిగా భావించకు. యిటుచూడు. నీవు పొడిబట్టలు కట్టుకో- యివిగో కండువాలు- నీవు యుడుపులు ధరించుదువుగాని, నేను బయటకు పోయిరాదా?' అన్నాను.

'మీకు పదివేలనమస్కారాలు. తలుపులు తీయకండి. నన్ను మరేమీ బాధించకండి' అంది ఆమె వణకుతూ.

'వసంతా! ధైర్యంవహించు' అని ఆమెకు ధైర్యం చెప్పుటకు నే నామె భుజం తట్టాను.

వసంత యేడుస్తూ వుంది.

'వసంతా యెందు కీ యేడుపూ?' అని కఠినంగా అడిగాను.

ఆమె బెదరి, బాష్పాశ్రులతో నన్ను విలోకించింది. ఆమె హృద్వేగంగా తలుపు దగ్గరకు వెళ్ళి, గొళ్ళెంతీశేసి, బయటకు వెళ్ళిపో

బోయింది. నేను కామాంధుడనై యామెను లోనికి యీడ్చివేసి, మరల తలుపు బంధించాను. ఆమె యిప్పుడు వసుంధరపై బడియుంది. ఆమె వెక్కి వెక్కి యేడుస్తూంది. నెమ్మదిగా నాపాదాలదగ్గరకు ప్రాకి, బాష్పరుద్ధకంఠంతో, అశ్రుజలంచే నాపాదములు తడుపుతూ యీ విధంగా ప్రార్థించింది.

'తండ్రీ నన్ను క్షమించి రక్షించు. మీముఖవర్చస్సుచూచి, మహాపదలోనున్న నన్నురక్షింప మీరే సమర్థులని, మీపాదాలపై బడి ఆశ్రయిస్తున్నాను. నాశీలం కాపాడండి. యే అవమానమునకు భయపడి మీశరణుజొచ్చానో, ఆఅవమానమే మీరు చేయదలచుటచే నక్కనుండి తప్పించుకొని పులినోట తలదూర్చినట్లయింది–అబలను. అసహాయురాలను. అర్థించి, పాదములపైబడి రక్షింపుమని వేడుకొంటున్నాను. నన్ను మీ కుమార్తెనుగా యెంచి నాప్రాణములు రక్షించండి. మీరు సాహసించినచో యీనాజీవితము నిరర్థకమై పోవును. నాఆశలన్నీ నశించిపోవును. నేను మరణించిపోదును. విశాల హృదయులై కొంచెం ఆలోచించండి. అని వేడుకొంది వసంత.

ఆమెదుస్థితికీ, ఆమెప్రార్థనకూ నామనస్సు కరిగింది. ఆసౌందర్యమూర్తికి సేవచేయుటే పరమావధిగా తలంచుకొన్నాను. బాబ్జీ మీద నేను పెట్టుకొన్నవొట్టుకూడ జ్ఞాపకం చేసుకొన్నాను. ఛీ. ఛీ. అనాథయై, శరణనిన స్త్రీని హింసించుటకన్న హీనం లేదనుకొన్నాను.

'వసంతా! భయపడకు నాహృదయం పూర్తిగా మారిపోయింది. నీవు నాబిడ్డవంటిదానివి. లే. లేచి కూర్చో!' అన్నాను నేను.

ఆమె లేచి నాకళ్ళల్లోకి చూచింది. నాకనులలోనిజ్యోతి సత్యసంధాయియని తలచుకొంది కాబోలు కొంచె మూరటబొందింది.

'తండ్రీ! హృదయం మంచువలె కరగిపోవటం నాఅదృష్టం అంతేగాక మీరుదయార్ద్ర హృదయులని వెల్లడియయింది. నాకెంతో

బలం చేకూరింది. నాహృదయకురంగం గంతులు వేస్తుంది. మీకు, జీవితం శేషమూ కృతజ్ఞరాలను అంది ఆమె విస్ఫారితములైన నేత్రాలను నాపై లక్ష్యము చేసి.

'బిడ్డా! వసంతా!! నీవు నాకు తగినజ్ఞానమును బోధించితివి. నీపై నాకున్న నీచవాంఛ పోయి, పుత్రికావాత్సల్యం జనించింది. నిన్ను ప్రథమమున చంచలహృదయగా నారభిప్రాయపడ్డాను, క్షమించు. అయితే నీవు మహాలక్ష్మమ్మ మనుమరాలివేనా? ఆమె మనుమడి భార్యవేనా? అను సందేహం నన్ను బాధపెడ్తోంది. నీవృత్తాంతం నాకు చెప్పు, యుచితమైనరీతి నీకు నేను సహాయపడుతాను' అన్నాను నేను.

'తండ్రీ! మహాలక్ష్మమ్మ నరరూపరాక్షసి. ఆమెయే నాజీవిత కుసుమాన్ని త్రుంపివేయదలంచిన క్రూరస్వభావిని. ఆమెమూలంగానే నేనిట్టి దుర్గతిలోపడిపోయాను. మహాలక్ష్మమ్మ వైష్ణవులవృద్ధ. నేను బ్రాహ్మణులపిల్లను. మాయిరువురికీ ఏవిధమైన చుట్టరికమూ లేదు. నేను ఆమె మనుమడిని పెండ్లియాడలేదు. ఆమె యెవనిని మనుమడని చెప్పిందో ఆనరసయ్య నిజంగా ఆమె మనుమడుకాడు. అతడొక కారుడ్రైవరు, మోసగాడు. తార్పులరాయుడు. స్త్రీహర్త......' అంది ఆమె.

ఆశ్చర్యచకితుడనై ఆమె చెప్పే పలుకులు వింటూన్నాను. పాపం! నిజంగా అబలయగు వసంత చాలవరకు అన్యాయం చేయబడింది. ఆమె సంపూర్ణచరిత్ర వినాలని నాకు ఆతురతగలిగింది.

'వసంతా! నీకేమీ అభ్యంతరంలేనిచో నీచరిత్రనంతనూ పూసగుచ్చినట్లు యేకరువుపెట్టు. విన నాకు ఆతురతగావుంది? అన్నాను.

వసంత నావైపు రెండునిమిషములు చూచింది. ఆమె యేమో ఆలోచించింది.

'అభ్యంతరంలేదు. నాకథ వినండి చెబుతాను.' అంది ఆమె.

నా బిచాన్నాలోని జంబుకానా యొసంగి ఆమెను దానిపై నుపవిష్టురాలనుచేశాను. నేను బిచానాపై కూర్చున్నాను. మిగిలి పోయిన బత్తాయిలుగా చక్రకేళీలుగా ఒలిచి యామెముందర పెట్టాను. ఆమెను తినవలసిందిగా హెచ్చరించాను. ఆమె క్షణం నాముఖంవైపు చూచి, వేవేగం ఆపళ్ళుతినడం మొదలుపెట్టింది. సగం తిని ఆమె సంతృప్తి పడింది.

'మంచినీరు కావాలా?' అన్నాను.

ఆమె అక్కరలేదని తలయూపింది. నేను సిగరెట్టు కాల్చుకొంటూయున్నాను. ఆమె తనజీవితకథను చెప్పమొదలు పెట్టింది.

మాస్వగ్రామం రాజమండ్రిదగ్గరనున్నా ధవళేశ్వరం. నేను ధవళేశ్వరంలోనున్న స్థితిమంతులగు నాగేశ్వరావుపంతులుగారి యేక పుత్రికను. నాకు చిన్నప్పుడే తలిదండ్రులు వివాహంజేశారు. నా జీవితశేషం, అనాథనై పడియుండటానికి కాబోలు నేను నాకు యుక్తవయస్సురాకముందే విధవనైపోయాను. అప్పుడు నా దుస్థితి నాకు తెలిసిందికాదు.

నాకు పదునాలుగేండ్లు పైబడ్డాయి.ఒక్కతే గారాబంపు బిడ్డనగుటచే నే నతిగారాబంగా పెరిగానేమో, నాకు అనేకవిధములైన దుస్తులు, కోరినన్ని వస్తువులూవుండేవి. నేను కొద్దిగా ఆంగ్లం చదువుకొన్నదాననగుటచే, నాకు నాగరికతకలిగింది. దానితో నా వేషభాషలలో నవీనపోకడలు గలిగాయి.

యౌవనోద్వేగ మంగము లావరించింది. యౌవనజ్యోతి యొడలెల్లా అలముకొంది. కోరినబట్టా కోరినవస్తువులూ వున్నాయి. మంచి బలంగలిగించే సుఖమైన భోజనముంది. పొంగీపొంగీపాలు, నా నరాలకు ఆకలి యెక్కువయింది. నే నేకాంతం సహింపలేని స్థితిలో నున్నాను. ఇట్లు విధవనై పడియుండుటకంటె ఆత్మహత్య చేసుకొనుటయే పదివేలసార్లు యుత్తమమనితలంచుకొని, దురపిల్లుతుండేదాన్ని.

ఈవైష్ణవుల మహాలక్ష్మమ్మ మాయింటికి వస్తూపోతూ వుండేది. యేవేని కాయాగరవ్రా వుంటూంటే పట్టుకొనిపోతూవుండేది. వైష్ణవకులస్థురాలనీ, వృద్ధురాలనీ, మాతలిదండ్రులు, ఆమెను గౌరవంగా చూసేవారు. తరువాత ఆమె నాతో కులాసాగా మాట్లాడడం చేయడంలో నన్ను మచ్చికచేసేసుకొంది. మాయింట్లోగాని, ఆవ్రూళ్ళోగాని నన్నెవ్వరైనా యెక్కువగా ప్రేమిస్తారాఅంటే యీమహాలక్ష్మమ్మ అనుకొంటూవుండేదానిని. యేమంటే ఆమె మాయింటికి వచ్చినప్పుడెల్ల నాతో యేకాంతంగా, నాదురవస్థకు జాలిచెందుతూ వుండేది. క్రమీపా యామె సంభాషణధోరణి మారిపోయింది. దాంపత్యంలో వున్నస్వర్గసుఖాన్ని గురించి యామె యెప్పుడూ నాకు బోధిస్తూ, నామనస్సంతా పురుషసాంగత్యం మీందే వుండేలా చేస్తూ వుండేది. అంతకంతకు నాలో దుర్బలత్వం ప్రవేశిస్తూవుండేది. నాకోర్కెలెక్కువై పోయాయ్. నాఆశలు దుర్మార్గాన్నే పరువులెత్తుతూవుండేవి.

'జీవికి తిండి యెంతఅవసరమో యౌవనానికి సాంగత్యమూ అంత అవసరమే. సంఘానికీ, లోకానికి ఝడిసి, హృదయాన్ని చంపుకొని, జీవితమంతా నాశనం చేసుకోవడం ఒట్టి అవివేకం, యెవ్వరి యానందం వాళ్ళు పొందవచ్చు. స్వర్గతుల్యమైన సుఖం చేజిక్కినప్పుడు అనుభవించుటే లెస్స.

నీ బాల్యవివాహానికి కారకులు నీతలిదండ్రులు. వారు చేసిన తప్పుకు శిక్షితురాలవు నీవా? నీకుమాత్రం హృదయం లేదూ? నీకుమాత్రం కోర్కెలు లేవూ? నీవు మాత్రం ఎందుకాసౌఖ్యం అనుభవించకూడదు? నీవు సంఘానికిగాని లోకానికిగాని యేమపకారం జేశావని, వాళ్ళు నీవు పొందబోయే ఆనందం చూచి సహింపలేకుండా వున్నారు? వెఱ్ఱిదానా యివన్నీ కపటములైన కట్టుబాట్లు. నీయంటి

కన్యల కుత్తుకలను తడిగుడ్డతో కోయడమన్నమాట. వసంతా! ధైర్యం వహించు. ప్రతికూలమాగుతాన్ని యెదిరించి నిలువబడు. నీసౌఖ్యం నీ వనుభవించు. నిన్నెదిరించి, నిన్నడ్డుపెట్టువారిని నీవే బహిష్కరించు.

బిడ్డా! పురుషసాంగత్యంలోవున్నా హాయి నీకేం తెలుసును? ఆసౌఖ్యం అనుభవింపని స్త్రీ జన్మ యొక జన్మయేనా? జీవచ్ఛవమై యుండుటకంటె ఆత్మహత్యయే మేలు. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డవు. ముమ్మరమైన యౌవనంలోవున్నావు, ప్రేమపయోనిధి నోలలాడు, ఆనంద తరంగడోలికల నుయ్యేలలూగు, సాహసం వహించు' అని యీవిధంగా నాకామె యేకాంతంగా బోధచేస్తూవుండేది. ఆమె మాటలు నాతలకెక్కిపోయాయి. నాయౌవనహృదయం తెగించింది.

'అవ్వగారూ! నేను నిజంగా యౌవనోద్రేకంతో చచ్చిపోతు న్నాను. మీరు కాస్తంత నాపై జాలిగా వున్నారు కాబట్టి నాకు మంచి సలహానివ్వండి! నేను తెగించాను. నే నిప్పుడు చేయవలసిన పనియేమి?' అని యామెకు నాదుర్బలహృదయాన్ని స్పష్టీకరించాను.

ఆమెకు మరింత వుత్సాహం కలిగింది.

'వసంతా! కోర్కెలు నెరవేర్చుకోవాలంటే అనేకములైన విధాలున్నాయ్. ఇంటనేయుండి రహస్యంగా తిరుగవచ్చు. లేకుంటే యెక్కడికైనా వెళ్ళిపోవచ్చు. లేదంటూ వా వితంతూద్వాహం యొనర్చు కోవచ్చు.' అంది ఆమె.

'అవ్వగారూ! వ్యభిచారానికి నామనస్సు సుతరాం అంగీకరిం పదు' అన్నాను నేను ఖచితంగా.

'అయ్యో! వెఱ్ఱివసంతా! అదిమాత్రం దోషమాయేమి? నాప్రథమమనుమరాలు భర్తయుండగనే, తనయానందకోసం లేచి పోయింది. నాద్వితీయ మనుమరాలు మగని వుట్టి సన్యాసినిజేసి యింటనే హాయిగా కులుకుతూంది. అటువంటప్పుడు, భర్త్రువిహీనవై నీవు లోకానికీ పాపానికీ ఝడియటమనేది హాస్యాస్పదం' అంది ఆమె,

'అవ్వగారూ! నామనస్సు నిజంగా పునర్వివాహంమీదవుంది. మీరు నాకీ విషయంలో సహాయం చేయగలుగుతే చేయండి. లేకుంటే నా కర్మ యింతేయని యేడ్చి యూరుకొంటాను' అన్నాను.

'బిడ్డా! నీ వెంతమాత్రం అధైర్యంపడకు. నీకు యేవిధంగా యిష్టమో, నేను అట్లే నీకు సహాయంచేస్తాను. పాపం నిన్ను చూస్తే నాకు జాలిగా వుంది కాని, వితంతూద్వాహానికి మీ తలిదండ్రులు వొప్పుకుంటారా?' అంది మహాలక్ష్మమ్మ.

'వా రెన్నటికీ వొప్పుకోరు. మా తండ్రి శుద్ధ ఛాందసుడు. మా తల్లికి అతినిష్ట. వా రిరువురూ సనాతనులే. వారికి శాస్త్ర అనుమానం తోచిందాంటే, యింక మన యత్నం విఫలం'అన్నాను నేను.

'అయితే నీవు యింట్లోంచి దొంగతనంగా వచ్చేయడానికి సంసిద్ధంగా వుండాలి.' అంది ఆమె.

అప్పటిమట్టుకు 'సరే' అన్నాను. మాసంభాషణముగిసింది. రహస్యంగా ప్రయత్నాలు జరుగుతూనేవున్నాయ్. కాని ,యింట్లోంచి తలిదండ్రులను మోసగించి పారిపోవడం నాకు మహాభీతిగావుంది.

మహాలక్ష్మమ్మ, రాజమండ్రి వాస్తవ్యుడగు ఒకయువకుణ్ణి సంబంధం చూచింది. 'కుఱ్ఱవాడు చక్కనివాడు. విద్యవుంది. పొలం పుట్రావున్నవాడే. అతని భావాలు పెద్దవి. హృదయం విశాలమయింది. ఇంక అతనికి యిదిలోటూ అనివేలుపెట్టి చూపించడానికి వీలులేదు. వసంతా! నీయందచందాలువర్ణించి, ఆతని హృదయం పుష్పంగజేసి, ఆతనినివొప్పించాను.

ఇంతయెందుకు? కోటేశ్వరావు నీకన్నివిధాలా తగినవరుడు. మీాయిద్దరూ చిలకాగోరింకలలాగు కాపురంచేసుకొంటారు. అతడు నామాటలు విన్నతరువరి నిన్నుతప్ప యన్యులను ప్రేమింపలేననీ,

నిన్నే పరిణయమాడుతానని పట్టుబట్టుకకూర్చున్నాడు. మరి నీవుద్దేశ మేమి? అని అడిగింది ఒకనాడు నన్ను మహాలక్ష్మమ్మ.

'యువకుడు అందగాడు, చదువుకున్నవాడు. పొలముగ్రా వుంది. స్నేహశీలి—యింక అతనికి లోటేముంది? యింతకంటె నాకు మంచిసంబంధం ఇహరాదు' అని అతనినే పరిణయమాడుటకు నిశ్చయించుకొన్నాను.

'అవ్వగారూ! మీకాసంబంధం నాకన్నివిధాలా తగిందనితోస్తే మీయిష్టప్రకారమే యేర్పాటుచేయండి' అన్నాను నేను.

ఆమెకూడ, నాఒప్పుదలకు సంతోషం వెలి బుచ్చింది.

కాలచక్రం దొర్లుతోంది. మహాలక్ష్మమ్మ నా కాబోవునాథునికీ నాకూ వార్తాహరురాలైంది మాయిరువురిమధ్య తొలుతలో సందేశాలు నడిచాయి' రానురాను ప్రేమలేఖలలోనికి దిగింది. ఆహా! అతడు వుత్తరాలు యెంతతీయగా, వలపుగా వ్రాశీవాడు. అవి చూచుకొని నేను మురిసీదాన్ని. పదేపదే వానినే చదువుకొనీదాన్ని, వానికి తగినట్టు నాప్రేమను వెల్లడిచేస్తూ జాబులు వ్రాస్తూవుండీదాన్ని.

అతడు నాకు ప్రేమకుసుమాలు పంపీవాడు. నేనూ అతనికి, జేబురుమాళ్లు అవీ స్వయంగా అల్లినవి ప్రేమపురస్కరంగాపంపీదాన్ని. మాయిద్దరికీమధ్య అవ్వ, యొక దేవతలా మా యంతరాత్మలకు ఆనందం కలిగిస్తూండేది. వుద్రేకం పుట్టిస్తుండీది. ఆహా! ఆమె ఋణం నేను తీర్చుకోగలనా? అనుకొనేదాన్ని.

'ప్రియా! నేనీదినం, కొత్తదంపతులను చూశాను. నాశరీరం ఉద్రేకపూరితమైంది. ఎపుడు నేను నాప్రియురాలైన వసంతతో కూడుకుంటానా అనితలపోశాను.........

'సఖియా! నాకు గతరాత్రి సుషుప్తిలో నీవు దృగ్గోచరమయ్యావు. నీవునవ్వుతూవచ్చి నాకు చేయూతనిచ్చావు. నేనానందంతో

తన్మయుడనై పోయాను. మెళుకువవచ్చి, యిది కలగదాయని ఉన్నరన్నాను. ఎన్నడిది నిజమౌతుందో అని ఆశిస్తూన్నాను......'

అని యీవిధంగా కోటేశ్వరావు వ్రాసిన పత్రాలు నామనస్సును సంపూర్ణంగా లోబరుచుకొన్నాయి. నే నాతనికొరకు యెట్టి తెగింపునైనా చేయుటకు సిద్ధంగానున్నాను.

'ప్రియురాలా! యీవియోగం దుర్భరం. దుర్భరం. నీవు పరిపూర్ణానురాగవై, నాపై నీ ప్రేమకటాక్షము బరపుము. మన వివాహం యెంతత్వరలో జరుగుతే అంత మంచిది. మనం యిరువురం పరిణయమాడుకొని, స్వేచ్ఛాజీవనం చేద్దాం. నీవు మనయాప్తురాలగు మహాలక్ష్మమ్మగారు చెప్పినట్లు చేయవలసింది.' అని మరొకసారి కోటేశ్వరరావు వుత్తరం వ్రాశాడు.

అక్కడనుంచీ, అతను మావివాహం యెప్పుడూ, యెప్పుడూ అంటూనే వ్రాస్తూవుండేవాడు. అవ్వకూడ అనేకవిధాల నాకు బోధించి ధైర్యం చెబుతూవుంది చివరి కొకనాడు పెళ్ళికొప్పుకొనుట తప్పనిసరియైపోయింది.

'ఆలస్యం అమృతం విషమన్నారు పెద్దలు. వసంతా! నీవు ఉపేక్ష చేసినచో కార్యం చెడుతుంది. నిన్ను వలచిన యువకుడు విరక్తి చెందుతాడు. మనకార్యమంతా భగ్నమైపోతుంది. ఇకను యాలోచించక నీవు ఒప్పుకొనకతప్పదు అంది అవ్వ. సరేనని' ఒప్పుకొన్నాను.

వెంటనే అవ్వ ఆవార్త కోటేశ్వరరావుదగ్గరకు పంపించింది. ఆత డానందమయుడై యుంటాడు. నా వివాహం యేవిధంగా జరగాలో అతడంతా విపులంగా వ్రాశాడు.

అవ్వ తెచ్చిన యీవుత్తరం చదువుకొన్నాను. నాగుండె గుభేలు మంది. ఇది నా ఆనందానికే వచ్చిందో నాదుఃఖానికే వచ్చిందో తెగింపుతో కార్యసంసిద్ధురాల నవుతానని యనుకొన్నాను.

ఆయుత్తరములోని సంగతులన్నీ మహాలక్ష్మమ్మకు కరతలామలకములే. మే మిరువురం రహస్యంగా సంప్రదించుకొన్నాం.

ఆ రాత్రియే నా పలాయనం.

## ౫

ఆ రాత్రి నా ప్రయాణం. పదిహేనుసంవత్సరాలనుంచీ పుట్టీ పెరిగినయింటినీ, కనిపెంచిన తలిదండ్రులనూ విడిచి, దొంగతనంగా యేదో సుఖం ఆశించి పారిపోతూవున్నాను.

హృదయవేదన లితరుల కెలా తెలుస్తాయ్. మానవజన్మలోనే దుర్బలత్వం వుంది. ఇంక యౌవనోద్వేగం తనువెల్ల కంపింపజేసేస్తుంది.

నా నగలన్నీ ధరించుకొన్నాను. నేను దాచుకొన్నా నూరు రూపాయలూ తీసుకొన్నాను. ఒక చిన్న లెదరుబ్యాగ్‌లో ఒక్క స్పేర్ డ్రెస్సు వేసుకొన్నాను. ఖరీదుగల దస్తులు ధరించుకొని ముస్తాబై గడియారం చూస్తూ కూర్చున్నాను.

నా పెళ్ళి. నేను భర్తతో హాయిగా కాపురంచేసుకొంటాను. అందరవలెనే నేనూ నా భర్తా బిడ్డలనుకని పెద్దసంసారం దిద్దుకొంటాం.

ఇంత తెగించి వెళుతూన్నానుకదా? నా దగ్గర వస్తువులూ సొమ్మూ వున్నవైరి. నన్నొకవేళ మోసగించి, చంపీ యీ వస్తువులన్నీ అపహరించేదురుద్దేశంలో వుందేమో మహాలక్ష్మమ్మ? నాకు భయం కంటే ధైర్యమే యెక్కువగా వుంది. ప్రపంచంలో నా కనుభవం లేదు కాబట్టి మోసాన్ని నే నెన్నడూ అనుమానింపలేను.

గడియారం టంగ్ టంగ్ మని పన్నెండుగంటలు కొట్టింది. ఆ దెబ్బలు సుత్తితో నా హృదయంమీద కొట్టినట్టే వున్నాయ్. నాలోని రక్తనాళాల్లో రక్తం వురుకుతోంది. నేను కంపించిపోతూవున్నాను.

ఒక్క క్షణం వుపేక్షించాను. గంటలమోత నా గుండెల్లోంచి దిగిపోయింది. అంతా నిశ్శబ్దంగా వుంది. నా సూటుకేసు తీసుకొన్నాను. వొక్కసారి అద్దంలో చూచుకొన్నాను. గోడకుతవిలించిన కృష్ణునిఫొటోకు నిమీలితలోచన నై నమస్కరించాను. మా అమ్మను తలచుకొన్నాను. 'అమ్మా! పుత్రికాశోకంతో నువ్వెంత ఏగిపోతావో? పొద్దుటే నేను కనపడకపోతే వసంతా వసంతా యని యేడ్చి యేడ్చి సొమ్మసిల్లి తిండికూడ మానివేస్తావుకదా? కాస్త తలనొప్పివచ్చిందంటేనే బెంగపడిపోయీదానివి నివు, యిప్పుడు నేను స్వయంగా పారిపోయా నని తెలుస్తే, యిఖ గుండె లవిసిపోయీవరకూ యేడువవూ? నీ కీ అంపపుకోత పెట్టాను, తల్లీ నన్ను క్షమించు.

నాన్నా!—అమ్మా! అమ్మా!! అంటూ నన్ను నీ కళ్ళతో పెంచావ్. అట్టి నికు నేను తీరని విచారం పెట్టడమేకాకుండా, నీ వంశానికీ, నీ కుటుంబానికీ, నికు శాశ్వతమైన అపకీర్తి, అగౌరవం ఆపాదిస్తున్నాను. నలువురిలో తలయెత్తుకొని తిరిగీయోగ్యత లేకుండా చేశేస్తున్నాను. ఆ అవమానమంతా యెల్లా భరిస్తావో? నే నే క్షణాన్నైతే అనాధనయానో ఆ క్షణమే నా పీక పిసికి, చంపిపారవేస్తే, నీకు నే డీట్టి దుష్కీర్తి రాకుండాపోయీది. ని కిదే నమస్కారం.' అని అమ్మనూ, నాన్ననూ జ్ఞాపకంజేసికొని, వేవేగం నిశ్శబ్దంగా వసారా తలుపు తెరచుకొని మా పెరటిలోనికి వచ్చి, అక్కడ పెరటి గుమ్మంకూడ తెరచుకొని, మా యిల్లు వదలి బయటపడ్డాను. ఇంత సాహసం యెల్లా వచ్చిందో నాకే ఆశ్చర్యంగా వుంది.

బయట చీకటి చీకటిగా [illegible] ంది. నిశ్శబ్దము మృత్యువువలె అతి భయంకరంగా వుంది. చీమ [illegible] న్నా గుండెల్లో యేదో దుడుకు ప్రవేశించుతూ వుంది.

ఇటూ అటూ పరీక్షించి చూశాను.

అనతిదూరంలో వున్న పొదలోంచి, ఒక నల్లని బలిష్ఠదేహుడు ప్రత్యక్షమయ్యాడు. నిజంగా ఆతడు నా కా సమయాన్ని యమకింకరుడులాం దృగ్గోచరమయ్యాడు. కెవ్వున కేక వేసేదాన్నే కాని, ఆపు చేసుకొన్నాను. ఆ వ్యక్తి తిన్నగా నా దగ్గిరకే వచ్చాడు.

'వసంతా!' అన్నాడు.

నా గుండె ఝల్లుమంది. ఆతనిగొంతు అతిమోహనంగావుంది. నన్ను రాక్షసుడు పిలుస్తున్నాడన్లే వుంది.

'వసంతా! నేను నరసయ్యను' అన్నాడు మరల నతడు.

నేను గ్రుడ్లు విడిచిపెట్టి చూస్తూవున్నాను. నా చేతిలోని సూటుకేసును ఆత డందుకున్నాడు. అతడు నా చేయి పట్టుకొన్నాడు. వజ్రహస్తం నా హస్తాన్ని బంధించినట్లు వుంది నాకు. అతడు వొక్క-సారి నా వైపు చూశాడు. నన్ను బరబరా లాగుకొని పోతూవున్నాడు. ఆకింకరుడు నన్ను నరలోకానికి యమునిసన్నిధకి గొనిపోతూవున్నాడా?

నరసయ్య నా కోసరం వస్తాడని నాకు తెలుసు. నే నతన్ని అనుసరించవలసివుంది. ఇప్పు డాతడు నన్నుగోదావరీతీరానికి తీసుకొనివచ్చాడు. ఆ ప్రదేశమంతా మహాప్రశాంతంగా మహాభయంకరంగావుంది. ఆకనుచీకటిలో అంతులేని యాగోదావరినిచూస్తే గుండె చెదిరిపోతూవుంది.

ఒకచిన్న డింగీలో మే మిరువురం ఆ గోదావరి దాటుతున్నాం. గోదావరమధ్యకు వచ్చేసరికి రివ్వున గాలివీచింది. వాతాహతమై డింగీ యిటూఅటూ వూగింది. అప్పుడు డింగీమునిగిపోతుందేమో ననిభయపడి ప్రాణాలురక్షించుభగవంతుడా అని దేవుని మనస్సులో వేయి విధాలా ప్రార్థించుకొన్నాను. అప్పుడే మాడింగీ మునిగిపోతే, నా కీ కష్టాలు వుండేవికావు.

గోదావరి యవతలవొడ్డును— బొబ్బర్లంక చేరుకొన్నాం. బొబ్బర్లంకలో నాకోసరం వేచియుంది మహాలక్ష్మమ్మ.

'అమ్మాయి! వసంతా!!' అంది అవ్వ.

గభాలున అవ్వను కౌగిలించుకొని ఒక్కసారి యేడ్చేశాను. ఎందుకు యేడుస్తున్నానో నాకే తెలీదు.

'యేం భయంలేదు. వసంతా యెందుకేడుస్తావు.' అంది ఆమె.

కాని, నాకు దుఃఖం పొంగుకువస్తూనే వుంది. నే నింకా వెక్కి-వెక్కి-యేడుస్తూనే వున్నాను.

'వసంతా! నువ్వింత బెంగపడటం కార్యసిద్ధం. నేనుండగా నీ వింతభయపడవలసిన పనేమిటి? వివాహమైతే చక్కగా కాపురంచేసుకోలేకా యీ యేడుపు? మరోసంగతి— శుభకార్యానికి యేడుపు మంచిదికాదు.' అంది ఆమె.

ఇప్పుడన్నిటికీ ఆమెయే నాకు దిక్కు. ఆమె యాజ్ఞలనుపాలించుట నాకుతప్పదు. నేనువెంటనే దుఃఖం దిగమ్రింగేశాను. మేంమువ్వరం మాకు సమీపంలోనున్నా చిన్నకారులో ప్రవేశించామ్. ఆమోటారు—నరసయ్య మాకోసరం యేర్పాటు చేసిందే.

మేం గన్నవరం దాటి రాకోలు చేరుకొన్నాం. మరల నది దాటవలసివచ్చింది. నది దాటి నర్సాపురం జేరుకొన్నాము. అప్పటికి తెల్లవారింది.

'అమ్మాయి, వసంతా! నీ నగలన్నీ తీసి నీ సూటుకేసులో జాగ్రతచేయి. లేకుంటే ప్రమాదం' అంది అవ్వ.

నేను వొక్క గొలుసూ, గాజులూ, లోలకులూ మినహాయించి నా చంద్రహారాలు, వడ్డాణం నా సూటుబ్యాగ్‌లో పెట్టేశాను. బ్యాగ్ నరసయ్యయే జాగ్రతపరచాడు. అనాధశరణాలయం జేరుకొన్నాము. అక్కడ శెక్రెటరీ మమ్ముల నాహ్వానించాడు.

అతడు కొంచెం వయస్సుమించినవాడు. అతి దయార్ద్రహృదయుడు. అందుచేతనే యిటువంటి ఉద్యమములో పనిచేస్తూవున్నాడు.

మే మా యాశ్రమం జేరుటతోడనే, మాకుస్నానాదికృత్యాల కన్నియేర్పాటులూ జరిగాయి. పెళ్ళిముహూర్తం కూడ వొక్కగంట లోనే. పెళ్ళివారు రాజమండ్రినుంచి, అప్పుడప్పుడే చేరుకొని విడిది గృహంలో ప్రవేశించారట. పెళ్ళికి మమ్ములను ఒక్క అరగంటలో సిద్ధంకావలసిందిగా సెక్రటరీగారు చెప్పారు.

నన్ను పెళ్ళికూతుర్ని చేశారు. నాకు కలుగబోతూవున్న సౌభాగ్యానికి దేవునికి వేయినమస్కారాలు చేశాను. పెళ్ళిస్వయంగా చేయడానికి, తల్లిదండ్రులు నోచుకోలేదుకదా?

ముహూర్తం సమీపించుచున్నకొలదీ, నాలోనొకవిధమైన దుడుకు పెంపొందుతోంది. నాశరీరం వణకుతోంది.

'పెళ్ళిపీటలమీదకు పెళ్ళికూతుర్ని పంపండి' అన్నారు పురోహితులు. నరసయ్య అరగంటకిత్రమే యెక్కడికో వెళ్ళాడు. పాపం మహాలక్ష్మమ్మ అతనిని వెదికింది. యే కాఫీకో వెళ్లాడు, వస్తాడులే అనుకొన్నాం. నగలు అతని దగ్గర వుండిపోయాయి.

విప్రులు తొందరచేస్తూవున్నారు.

'అమ్మాయి వసంతా! నరసయ్య యిలా యెక్కడికో వెళ్ళాడని మనం అల్లరిచేసుకొంటే నలుగురిలోనూ నగుబాట్లవుతాయ్. పైపెచ్చు ముహూర్తసమయం మించిపోయిందీ అంటే వివాహం జయప్రదం కాదు. వెంటనే బయలుదేరు' అని హెచ్చరించింది మహాలక్ష్మమ్మ.

నా కేదో ప్రమాదం జరుగుతున్నట్లు, మొదటిసారి భయపడ్డాను నేను. నరసయ్య కాస్సేపటికి రాకాపోతాడా అని ధైర్యం తెచ్చుకొని, పెళ్ళికి సంసిద్ధురాలనయ్యాను. ఆ ఆశ్రమములోని అనాధ బాలికలే నాతరపుపెళ్ళిపెద్దలయ్యారు. అందులో వొక అమ్మాయి

నన్ను చెయ్యిపట్టుకొని పెళ్ళిమందిరంలోకి గొనిపోయింది. నన్ను పెళ్లి పీటమీద కూర్చోపెట్టింది. నాదగ్గర ఆబాలికలందరూ గుమిగూడారు.

పెళ్ళిమందిరమంతా జనంతో నిండివుంది. వీధిలో బాజాభజంత్రీలు వినిపిస్తూవున్నాయ్. బ్రాహ్మణోత్తములు మంత్రాలు మొదలు పెట్టారు. పెళ్ళి జరుగుతూంది.

'పెళ్ళికుమారుడు అన్నివిధాలా తగినవాడు' అనే మహాలక్ష్మమ్మ పలుకులు జ్ఞాపకంవచ్చాయ్. ఆతడు పరిణామంపొందిన ప్రియుడువలె వ్రాసీవుత్తరాలూ, అంగట్లో నాతడు చేసిన అమృతప్రేమాలాపనలూ నన్ను—పెళ్ళికుమారుడైన కోటీశ్వరరావు వొక సుందరపురుషుడనియూ, ప్రేమపిపాసియనియూ మురిపింపజేశాయేమో, ఆతనిముఖం కన్నుల పండువుగా వొక్కసారి చూడాలనే కుతూహలం నాకు గాఢంగా కలిగింది. సమయంకోసం చచ్చిపోతూవున్నాను.

ఇంతలో మంగళసూత్రం కట్టవలసిన సమయం వచ్చింది. పెళ్ళికుమారుడు మంగళసూత్రం పుచ్చుకొన్నాడు. ఇంతలో యెవరో జనం బలబలలాడుతూ వివాహోద్వాహం చూడ్డానికని వచ్చారు. మందిరంలోని యందరిదృష్టి ఆ యాగంతకులపై బడింది. ఇదే యదునని, పెళ్ళికుమారునిముఖం తేరిచూశాను.

కెవ్వున కేకవేసి, పెళ్ళిపీటమీదనుంచి లేచి పారిపోబోయాను. అక్కడనున్న అనాధబాలికలు నన్ను పట్టుకొని ఆపుచేసేశారు. ఆ మందిరములోని వారందరూ నిర్ఘాంతపోయి చూస్తూవున్నారు. మరల నొకసారి కోటీశ్వరరావుముఖం చూశాను. అతడు నిర్విణ్ణుడైయున్నాడు.

'ప్రాణాలుపోయినాసరే యీ కురూపిని నేను పెండ్లియాడకూడదు' అని నిశ్చయించుకొన్నాను. నే నెంత నిశ్చయంతో తెగించి యీ వివాహానికి సిద్ధపడ్డానో అంత నిశ్చయంతోనే యీ పరిణయం వదలుకోవా లనుకొన్నాను.

పెళ్ళికుమారునితరపు పెళ్ళిపెద్దలందరకూ కోపాలు వచ్చేశాయ్.

'సిగ్గు! సిగ్గు!!'— 'చావగొట్టి ఆ అమ్మాయిని పీటమీంద కూలవేయండి—యిట్టి నెధవముండను పెళ్ళాడడం మనదే తప్పు'— అను కేకలు—పెద్ద కలకలంతో పాటు—ఆ పెళ్లి పెద్దలలో బయలుదేరింది.

నేను నా ముఖం రెండు చేతులతోనూ మూసుకొని వెక్కి-వెక్కి యేడుస్తూ వున్నాను.

'దయుంచి మీ రందఱూ కాస్త నిశ్శబ్దంగా వుండండి' అను గంభీరమైన కంఠం వినుపించింది, ఆ మందిరమంతా నిశ్శబ్దమైపోయింది. శెక్రిటరీ యిట్లు ఆందోళన కాస్త యణచి నా దగ్గరకు వచ్చి నా శిరము నిమిరాడు.

'తల్లీ! యెందుకు నువ్వు యిల్లా పీట్లమీందనుంచి లేచిపోయావు? యెందుకు యేడుస్తున్నావు? నీకు నేను తండ్రివంటివాణ్ణి. మరేం భయం లేదు. నీకు కలిగిన కష్టమేమో చెప్పమ్మా చెప్పు. నీ మతానుసారం నేను జరిగిస్తాను' అన్నాడు శెక్రిటరీ.

నా పక్షాన్ని పలికేవా డొక డున్నాడుకదా అను ధైర్యం తెచ్చుకొని—తండ్రీ! అనాథను, నన్ను రక్షించుడు. మీకు నమస్కారము— నన్ను మోసంచేశారు. నే నీతనిని పెళ్ళియాడను. అని ఖచితంగా చెప్పేశాను.

నిజానికి కోటేశ్వరరావు చాల అందవిహీనుడు. స్ఫోటకపు మచ్చలతో, అతడు నల్లగా, బలహీనంగా చూడ రోతగావున్నాడు. అతని ఆస్తిసంగతీ విద్యసంగతీ భగవంతునికి తెలుసును. అటువంటి వానిని చేబట్టుటకంటె విధవత్వమే అన్నివిధాలా యోగ్యం.

'అంతా దీని యిష్టమల్లేవుంది, చూస్తా వేమిరా! కోటేశ్వర్రావూ! పడేశి, మెడలో పుస్తి కట్టిపారేయ్' అన్నాడు ఒకాయన గంభీరంగా.

'కాస్త శాంతం వహించండయ్యా! అసలు కారణ మేమో విననీయండి' అని అంటూ శెక్రిటరీ మరల నా మస్తకం నిమురుతూ.

'తల్లీ! నీ కేంభయం లేదు. నీ వీతని నెందుకు చేసుకోనంటున్నావో పదిమందిలోనూ చెప్పేయి.' అన్నాడు.

'నన్ను మోసంచేశారు. ఇల్లాంటి కురూపిని నేను పెళ్ళాడను.' అన్నాను నేను. మందిరంలో కలకలం బయలుదేరింది. కిలకిలమను నవ్వుకూడ బయలుదేరింది. ఆ నవ్వినవారు కొత్తగా వివాహం చూడ్డానికి వచ్చిన ప్రేక్షకు లని గ్రహించాను.

'ఈ వెధవముండకు అందాలు కావాలికాబోలు' అన్నాడు ఒక కఠినుడు.

'మరి తల్లీ! నీ వీతనిని ముందుగా చూడలేదూ?' అన్నాడు శెక్రటరీ.

'తండ్రీ! చూడలేదు. నన్ను మోసంచేసి అందగాడని చెప్పారు.'

'నేనీమెనే పెళ్ళాడుతాను. ఇప్పటికి చాలఖర్చు పడియున్నాను. ఈమెను తప్ప నే నెవ్వరినీ పెళ్లాడను' అన్నాడు కంగారుగా పెళ్ళి కుమారుడు కోటేశ్వరావు.

'నా ప్రాణాలు తీసేసినా నేనితన్ని వివాహమాడను' అన్నాను నేను మరింత ఖచితంగా—మొండిధైర్యం తెచ్చుకొని.

'పోనీలే తల్లీ! నీ కిష్టంలేకుంటే మరోవరుణ్ణి చూసి చేస్తాంలే' అని ధైర్యం చెప్పాడు శెక్రటరీ

'అల్లా వీలులేదు' అన్నాడు కంపితకంఠంతో పెళ్ళికొడుకు.

'చూస్తా రేమిరా! బలవంతంగా దీన్ని మోసుకుపోదాం పదండి' అన్నాడు పెళ్ళికొడుకు తరుపువాళ్ళలో వొకడు.

'వీళ్ళు రౌడీలు లా వున్నారు. సమయానికి పోలీసువారినైనా పిలువలేదు' అని గొణుగుకొన్నాడు శెక్రటరీ.

అక్కడకువచ్చిన నూతనప్రేక్షకులు నెమ్మదిగా జనాన్ని తప్పించుకొని నేనూ శెక్రటరీ వున్నాచోటికి వచ్చారు. వారిని చూస్తే

నాకు ఆశ్చర్యంవేస్తుంది. అందరూ యువకులే. అందరూ నవనాగరి కులే—వారంతా విద్యార్థులని అనుకొన్నాను.

'అయ్యా! నాదొక్క-మనవి' అన్నాడు అందులో అందగాడైన యొక యువకుడు.

అంతా నిశ్శబ్దమైపోయింది. అందరూ నిర్ఘాంతపోయి అతని సుందరముఖారవిందాన్ని ధ్యాననిమగ్నులై చూస్తూవున్నారు.

'ఈ అమ్మాయి పెళ్ళికొడుకును యిదివరకు చూడలేదట. మధ్యవర్తులు ఆమెను మోసంచేసి అతడు అందగాడనే చెప్పివున్నారట. పాప మామె నమ్మి వివాహాని కొప్పుకొంది. పెళ్ళికుమారుడు నిజంగా అందహీనుడని యందరూ యేకగ్రీవంగా వొప్పుకొనవలసిందే. అందు లో నా యమ్మాయి నిసర్గసుందరత్వానికి యీతడేవిధంగాను తగడు. అందులోనూ యీ వివాహం స్వేచ్ఛావివాహం. ఒకసంఘానికి, వొక కట్టుబాటుకీ లొంగేదికాదు. హృదయసంబంధమైన పవిత్రమైన పరిణయ మిది. ఆమె హృదయాని కతడు నచ్చలేదు. అందుచే ఆమెజోలికి పోక ఆమెను దయదలంచి విడిచిపుచ్చండి. మీరు మరో మంచి సంబంధం చేసుకోండి' అన్నాడు అతడు గంభీరంగా.

'అ దెల్లా కుదురుతుంది? మేం యీ పెళ్ళికని బోల్డు ఖర్చు పోయాం. ఇదే కాకుండా మాకు కావలసినంత అమర్యాద, అపఖ్యా తీని. నూరుఅబద్ధా లాడి వొక పెళ్ళి చేయమన్నారు. స్వామీ! మీరు తప్పుకోండి. మే మా పెళ్ళికూతురుతో మా తిప్పలేవో మేం పడతాం' అన్నా డొక పెద్దమనిషి.

'అయ్యో! నా అయిదువందలరూపాయలుమాటేంటి? ఆ ముస లిముండ మహాలక్ష్మమ్మ మా కీ సంబంధం కుదిర్చినందులకు లంచ మిచ్చాం.' అన్నాడు పెళ్ళికొడుకు కంగారుగా.

అయిదువందల లంచంమాటా వినేసరికి నాలో దుడుకు బయలుదేరింది. నా ళ్ళింక నన్నేలానూ విడువ రనుకొన్నాను. నా నగలన్నా దగ్గరుంటే......యిచ్చేసేదానిని.

'మధ్యవర్తి వి తగువు తీర్చడానికి బయలుదేరావ్. మాకయిన ఖర్చులతోసహా మాకు యేడువందలరూపాయలు రావాలి. అవి అక్కడ పెట్టు.' అన్నాడు వాళ్ళతరఫు మనిషి వొకడు.

'అయ్యా! మహాలక్ష్మమ్మ నరసయ్య అనే మధ్యవర్తులు తమ దగ్గర దాస్తామని యిప్పుడే నా చంద్రహారాలూ, నా వడ్డాణం పుచ్చుకొన్నారు. వారు అవి నాకు తిరిగి యిచ్చివేస్తే, మీ డబ్బు మీ కిస్తాను. లే దంటారా యీ నా మెడలోని గొలుసూ, నా గాజులూ తీసుకోండి' అని నా గాజులు తియ్యబోయాను. శెక్రెటరీ ఆపుజేశాడు.

'ముందు, 'ఆ మహాలక్ష్మమ్మ! ఆ నరసయ్య!! యెవ్వరో వాళ్ళను పట్టుకోండి. వాళ్ళు వస్తువు లపహరించేవుంటారు. వొరేవ్ మోహన్! నీవు వెంటనే వెళ్లి సబిన్సుపెక్టరు రామారావును తక్షణం నేను రమ్మన్నానని పిలుచుకొనిరా. వెళ్ళు నీ సైకిలుమీద వెళ్ళు!

'పెళ్ళిపెద్దల్లారా! మీ రంతా వచ్చినదారిని నడుస్తే మంచిది.' అన్నా డా యువకుడు.

'యేరా వేణూ! యింకా శాంత మెందుకురా నీకు? వీళ్ళందరినీ లాటీఛార్జి చేసి, రాజమండ్రి తోలేయమంటావా?' అన్నాడు అందులో భీమసేనుడులా వున్నా వొకయువకుడు ముందరకు వెళ్ళి.

నా తరపున మాట్లాడే ఆయువకుడు వేణు అని గ్రహించాను. శెక్రెటరీ, మోహనులు అక్కణ్ణుంచి వెళ్ళారు.

'ఇంతతొంద రెందుకురా అయ్యస్వామీ! నీకు?' అని అయ్యస్వామిని కొంచెం చికాకుగా వెనుకకు లాగుకొన్నాడు వేణు.

'వీడికీ ఆ పిల్లకీ సంబంధం వుందన్లే వుంది. ఇల్లాంటి వ్యభిచారి ముండ మనకెందుకురా! పోదాం పదండి' అన్నాడు పెళ్ళికొడుకు తరఫున వొకాయన.

'నాకీ పిల్ల కావాలి' అన్నాడు కోటేశ్వర్రావు.

'చప్ నోరుముయ్' అన్నాడు అయ్యస్వామి కాదార్కారుడై.

'అయ్యా! మీరింక దయచేయండి. మాకు మీ సంబంధం వొద్దోయి నాయనా అంటూంటే యింకా యీ మొండితనం యెందుకు? మీరు త్వరగా వెళ్ళితే, వుభయులకూ శ్రేయస్కరం' అన్నాడు వేణు.

శెక్రిటరీ నిరుత్సాహంతో తిరిగి వచ్చాడు.

'మహాలక్ష్మమ్మా, నరసయ్యలు యిద్దరూ యెక్కడా కన్పడడం లేదు. వస్తువులు పుచ్చుకొని వాళ్ళు పారిపోయినట్టున్నారు. తల్లీ వసంతా! నీకేమైనా వారిజాడలు తెలియునా?' అన్నాడు శెక్రిటరీ.

'నాకేం తెలీదండి' అన్నాను నేను.

'తగినశాస్తి అయింది' అన్నాడు కోటేశ్వర్రావు మనస్సుపట్టలేక.

ఇంతలో మోహనూ, సబిన్సుపెక్టరు రామారావూ వచ్చారు.

'బ్రదర్ రామారావ్! చాలమోసం జరిగింది. ఈవసంతను మోసగించి, యీపెళ్ళివారు బలవంతాన్న పెళ్ళిచేసుకోబోయారు. మధ్యవర్తులు యెవరో— మహాలక్ష్మమ్మ, నరసయ్యా అనువారలు యీమెవడ్డాణం, చంద్రహారాలూ యెత్తుకొని పారిపోయారు. మన మిప్పుడు చేయవలసిన కర్తవ్య మేమిటి?' అన్నాడు వేణు.

'ట్రెయిటర్సు!—ముందు యీ పెళ్ళికొడుకునూ యిందులో ముఖ్యులనూ అరెస్టుచేయాలి. అప్పుడా వస్తువు లపహరించుకొని పోయిన మహాలక్ష్మమ్మ నరసయ్యలు పూడిపడతారు' అన్నాడు గంభీరంగా సబిన్సుపెక్టరు.

'అయ్యో నాయనా! మమ్ములను అరెస్టుచేయడమెందుకు? మమ్ములను మోసగించి, మాదగ్గర అయిదువందలరూపాయలు లంచం పుచ్చుకొని ఆమహాలక్ష్మమ్మ, నరసయ్యా పారిపోయారు. మమ్ములను నెత్తిని గుడ్డవేసుకొని పోనీయండి. మీకు పుణ్యముంటుంది.' అన్నాడు కోటేశ్వరావుతరపు పెద్ద.

'ఏం వీలులేదు. ఈకేసు అంతా బయటకు వచ్చేవరకూ మీరు ఖైదులో వుండవలసిందే. యేంరా అబ్దుల్!' అన్నాడు సబిన్సుపెక్టరు.

'సార్!' అని యెదరకు వచ్చి నిలబడ్డాడు కానిస్టేబిల్.

'చూస్తావేమిరా! యితడే పెళ్ళికొడుకులా వున్నాడు. యితన్ని అరెస్టుచెయ్.' అన్నాడు యిన్సుపెక్టర్ కానిస్టేబిలుతో.

కానిస్టేబిలు, జేబులోంచి యినుపసంకెళ్ళు తీశాడు. కోటేశ్వరావు యేడుస్తున్నాడు.

'రామారావ్! యితనిని అరెస్టుచేయకు. జామీనుమీద విడుదలచేశేయ్. వాళ్ళందరినీ ప్రస్తుతం యిక్కడనుంచి పోనీయ్. ముందు ఆ మహాలక్ష్మమ్మా, నరసయ్యలసంగతి చూద్దాం. శెక్రిటరీగారూ! మీరు వసంతను ప్రస్తుతం మీ దగ్గరనే వుంచి జాగ్రత్తగా చూస్తూ వుండండి. పాపం! యీ అమ్మాయిని లోనికి తీసుకొనివెళ్ళండి.' అన్నాడు వేణు.

నేను లోనికి గొంపోవబడ్డాను. వేణు నాకు దేవుడై నిలిచాడు.

౬

'వసంతా! నీ వెన్ని దురవస్థలపాలై పోయావ్. అటువంటి కష్టజీవిని నిన్ను మరింత బాధించిన కఠినాత్ముణ్ణి నేను— నన్ను క్షమించు' అన్నాను నేను. నిజంగా నాకు, వసంతయొక్క గాథ వింటే దుఃఖం ఆగలేదు.

'మీరు కరుణాస్వరూపులు నన్ను తండ్రివలె యిపుడు కాపాడు తున్నారు.' అంది వసంత.

'వసంతా! తరువాతకథ కూడ చెప్పు. ఇక్కడకు మరల నీ వెలా వచ్చావ్? మరల యీ ముసలిరాక్షసి మహాలక్ష్మమ్మహస్తగత మెల్లాఅయ్యావ్' అని నే నామెను కుతూహలంగా అడిగాను.

వసంత తన దుఃఖగాథ చెప్పుకొనేటప్పుడు గ్రుడ్ల నీరు గ్రుక్కు కుంది. ఆమె—నేత్రాలను తుడుచుకొని మరల తన జీవితచరిత్ర చెబుతూవుంది—

నేను శెక్రిటరీగారి యింటిలోనికి కొనిపోబడ్డానుకదా! ఆపిదప నేను మిగిలిన అనాథబాలికలతోబాటు, ఆభవనమందే యున్నాను. పెళ్ళివారు వెళ్ళిపోయారు. సబిన్సుపెక్టరుగారూ, వేణూ అతనిస్నేహితులూ మహాలక్ష్మమ్మనూ నరసయ్యనూ పట్టుకొనే నిమిత్తం వూరంతా తిరుగుతూవున్నారు.

వేణు విఫలమనోరథుడై తిరిగి శరణాలయానికి వచ్చేశాడు. వేణూ శెక్రిటరీ కలసి నా దగ్గరకు వచ్చారు. మేం ముఖద్వారం కింద జంబుకాణాపై కూర్చొనియున్నాం.

'శెక్రిటరీగారూ! మనం వస్తువులవిషయమై అంతగా విచారింప వలసిన భయంలేదు. ఇన్సుపెక్టరు రామారావు దిట్టమయినవాడు. శ్రద్ధగా పనిచేసి మహాలక్ష్మమ్మనూ నరసయ్యనూ పట్టుకొంటాడు.

ఇపుడు మనం కర్తవ్యమేమిటో ఆలోచించాలి. వసంత తలిదండ్రులదగ్గరకు వెళ్లిపోతానంటే, యిప్పుడే వాళ్ళకు టెలిగ్రాం యిస్తాం. లేదా, ఆమె మరియొకరిని వివాహం చేసుకోదలచినట్లయితే, తగినవాడూ నచ్చిన వాడూ దొరికినవెంటనే పరిణయం చేసివేయ వచ్చును. మరి యే సంగతీ తేల్చుకొంటె మంచిది.' అన్నాడు వేణు.

'తల్లీ! వసంతా! వేణుమాటలు విన్నావుకదా! నీ యభీష్టం యేదో చెబుతే మేం ఆప్రకారం చేస్తాం' అన్నాడు శెక్రిటరీ.

'తండ్రీ! మీరంతా యెల్లా చెబుతే అలానే వింటాను. ఆపత్సమయంలో కాపాడిన మీరుకాక నాకిప్పుడు దిక్కెవ్వరున్నారు?' అన్నాను నేను తలవంచుకొని.

'తల్లీ! యిపుడు మేం, నీ తలిదండ్రులకు కబురుచేస్తే, వాళ్ళు వచ్చి నిన్ను తీసుకొనివెళ్ళుతారు. నీకు వివాహమవ్వక సరికదా నీవు లేచివెళ్ళిపోయినా వనే అపవాదు రాకమానదు. అందుచే నీవు యిక్కడవుండి, తగినసంబంధం రాగానే, పెళ్లిచేసుకొని సుఖంగా వుండటం మంచి దని నా యుద్దేశం. నీయంటి అప్సరసను—యీ నవ యుగంలో వివాహంచేసుకొనడానికి జంకేవాళ్ళెవరూ వుండరు. నిన్ను పెళ్లాడడంలో, సంఘసంస్కర్తలై, పాపకలనాథబాలిక జీవితమును కాపాడినవారూ అవుతారు. అంతేగాక దేవకన్యకలాంటి పిల్లను సంపాదించుకొన్నవారూ అవుతారు. ఈకారణాలచే నీకు అనతికాలం లోనే మంచిసంబంధం వస్తూంది.' అన్నాడు శెక్రెటరీ.

'తండ్రీ! మీ యిష్టం.' అన్నాను నేను.

'వేణూ! యీమె కిష్టమయింది. ఇక్కడే వుంటుంది' అన్నాడు శెక్రటరీ.

'అయితే శెక్రటరీగారూ! యీమె చూస్తే గొప్పవారిబిడ్డలా కనపడుతూవుంది. పాపం! పేదరికానికి యెన్నడూ అలవాటుపడి యున్నట్టు లేదు. అందుచే యీమెను తోడిబాలికలవలెగాక చాల జాగ్రతగా చూస్తూండవలెను. పైపెచ్చు, భయపడిపోయిన హృదయం ఆమెది.

ఆమె కయ్యే ప్రత్యేకపుఖర్చులకుగాను నెలకూ ముప్పైరూపాయలచొప్పున యిస్తూవుంటాను. మంచిసంబంధం వచ్చినట్లయితే వెయ్యిరూపాయలవరకూ ఖర్చుపెడదాం.' అన్నాడు వేణు.

వేణుపలుక్కలకు నేనూ, శెక్రిటరీకూడ నిర్ఘాంతపడిపోయాం. నేను వేణును జాలిగా చూశాను. మా యిరువురి చూపులూ అప్రయత్నంగా కలిశాయి. నాశరీరంలో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది. నాలోని రక్తనాళాలు పరిమదమున పొంగుతూవున్నాయ్.

'వేణు నాకోసం యింతత్యాగం చెయ్యడానికి కారణ మేమా' యని యాలోచిస్తూ, ఆతనివైపు తదేకదీక్షగా చూస్తూవున్నాను.

'వేణూ! నీ యద్భుత ధైర్యసాహసాలకూ, త్యాగానికీ నాకు చాల సంతోషం. కాని, యింతసాహసవంతుడవనీ, త్యాగివనీ నే నెరుగను. నీయంటివాడు సంఘసంస్కర్తగా వుంటే సంఘం అనతి కాలంలోనే బాగుపడేది.

నీవు కరుణాత్ముడవై యిస్తానన్న ఆ ముప్పైఫయోపాయలూ నేను తిరస్కరిస్తున్నానని నీ వేమీ మనస్సులో పెట్టుకోకు. నేను వసంతను నా కుమార్తెవలే చూచుకొంటాను. నీ వా విషయంలో యేమీ సందేహంపెట్టుకోకు. ఇంక వివాహవిషయంలో అంటావా, బాధ్యతంతా నీదే... మరోసంగతి—నీవు వసంత యిక్కడ వున్నంత కాలం ఆమెకు ధైర్యంచెప్పి వెళుతూవుండు. నీకు ఆ యేర్పాటు లన్నీ చేయిస్తాను' అన్నాడు శెక్రటరి వేణుతో.

వేణుముఖకమలం వికసించింది, ఆతని ముఖంలోని కళ యెంతో ఆకర్షణీయంగావుంది. అతడు నా కళ్ళలోతుల్లోకి చూశాడు. నా హృదయకురంగం గంతులువేస్తూ అతని దగ్గరకు పరుగెత్తుతోంది.

'శెక్రటరీగారూ! మీయంటి యోగ్యులుండుటచే యీ యనాథశరణాలయాలనీ, వితంతూద్వాహపుసంఘాలనీ యింకా వున్నాయ్. మీరు కోరారుకాబట్టి నేను రోజూ సాయంకాలం వస్తూవుంటాను. ఇంక నాకు సెలవిప్పించండి. వసంతా! వెళ్ళి వస్తాను' అన్నాడు వేణు.

'మంచిదండి' అన్నాను హృద్వేగంతో. అంతకంటే యెక్కువ యేమీ అనలేకపోయాను. నా కష్టా లన్నీ అతనికి యేకరువుపెట్టుకొని

యాతడు చేసిన వుపకారానికి కృతజ్ఞత తెలుపాలని అంతకుముందు నుంచీ యాలోచించి చివరకు తెల్ల మొహం వేశాను.

నీవు తప్పక రోజూ వస్తూవుండాలి. వసంతకు యిప్పుడు నే నెంత యాప్తుణ్ణో నీవూ అంతే. కాబట్టి, వేణూ! నీవు వసంతమాట మరచిపోగూడదుసుమా' అన్నాడు శెక్రిటకీ.

'పంతులుగారూ! నా సంగతి మీరు తెలిసికూడా యింతగా చెప్పాలా? నాళ్ళుంలో వున్న యీమెను విడిచి వెళ్ళుటకు నా కిష్టంలేదే కాళ్ళాడకుండా వున్నని' అన్నాడు వేణు.

మీయంటి యాప్తులు దొరకుటచే నేను నిజంగా ధన్యురా లను అన్నాను నేను యెల్లాగైతేం సాహసించి.

'వసంతా! నీయందు నీకు తెలీదు కాని, యే వ్యక్తైనాసరే నీ ముఖలక్షణాలు చూచి నీ కాప్తు డైపోవాల్సిందే.'

'మీ యంతస్థు గొప్పది. ఎదుటివారి మంచినే గ్రహించు గుణం మీలో వుంది' అన్నాను నేను.

'వసంత బాలికయైనా, నిజం గ్రహించింది' అన్నాడు శెక్రిటకీ.

'వసంత వసంతకాలపు తొలిపుష్పం లాంటిది. ఈమెను వివాహమాడువాడు చాల అదృష్టవంతుడు' అన్నాడు వేణు.

నేను సిగ్గున తలవంచుకొన్నాను.

'ఆ భారమంతా నీదే.—ఆ అదృష్టవంతుణ్ణి నువ్వే లాక్కు రావాల్సివుంటుంది' అన్నాడు శెక్రిటరీ.

'మరి నే నింక వెళ్ళివస్తాను' అని వేణు శెక్రిటరీదగ్గర సెలవు తీసుకొని, నన్ను చిఱునవ్వుతో హెచ్చరించి వెళ్ళిపోయాడు.

'వసంతా! వేణు గొప్పవారింటిబిడ్డ. ఆస్తిపాస్తులూ, రంధు కోటీ యున్నవాడు. ఇప్పుడు బి. ఏ. సీనియర్ చదువుతున్నాడు. అతడు సాహసవంతుడూ సంస్కర్తాకూడాను. సమయంవస్తే అతనే

అన్నిటికీ నిలబడతాడు. మనం ఆతనిప్రాపు విడువకుండుట మంచిది. మరోసంగతి. ప్రేమ నడువలేనిచోటికి ప్రాకియయినా పోతుంది. అంతేగాక ప్రేమ ప్రేమను పుట్టిస్తుంది. కావున నీవుగినా కాస్త చలాకీగావుండి, వేణుతో చనువుగా వున్నావంటే, అతడు నిన్ను తప్పక ప్రేమిస్తాడు. ప్రేమ గుడ్డిది. ఒకసారి ప్రేమించాడా అంటే వేణు మరల తిరిగిపోయీవాడుకాడు. ఈ మాట మనస్సున వుంచుకొని, అత డెప్పుడు వచ్చినా, యాతనిహృదయం రంజింపజేసి, యాతనిని వశపరచుకో. నీ మీాదనుండే వాత్సల్యంకొద్దీ నీకు నే నింతగా చెబుతున్నాను'' అన్నాడు శెక్రిటరీ.

'మీా సహాయానికి, సలహాలకు నే నెంతయూ కృతజ్ఞురాలను. మీాఋణం యెన్నిజన్మాలకైనా తీర్చుకోలేను' అన్నాను నేను.

'వసంతా! వసంతా!!' అను పిలుపు.

ఆ మధురకంఠస్వరం నా కిపుడు బాగా పరిచితం. వేణు వచ్చాడని, వేగంగా వెళ్ళి తలుపుతీశాను. వేణు అన్నామాట ప్రకారం సాయంకాలాల వస్తూనేవున్నాడు. మే మిరువురం ఒక్కయరగంట కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ వుండేవారం.

నాలుగైదురోజులు గడిచాయి. మహాలక్ష్మమ్మా, నరసయ్యల జాడ యేమీా దొరకలేదు. ఇన్సుపెక్టరు రామారావుగారు విశ్వప్రయత్నాలు చేస్తూనేవున్నారు. శెక్రటరీగారుకూడ నన్ను తమ సొంతబిడ్డలా చూచుకొంటూ వున్నారు. తోడి అనాథబాలికలు యెంతో కలివిడైనవారు.

నా కిప్పు డక్కడ చాల ఆనందంగా వుంది. తిండికీ బట్టకూ యిబ్బందిలేదు. స్నేహితురాండ్రు మేం అస్తమానూ యే వీణో, ఫిడేలో వాయించుకోడం, పాటలు పాడుకోడం, సాయంకాలాలు రింగుటెన్నిస్సు కేరంసు ఆడుకోడం—మంచిసినిమా వస్తే చూడ్డానికి

వెళ్ళడం యిలా జరిగిపోతుంది. బాలికలు అనేకపోకిళ్ళుపోతూ చాలా సర్దాగావుండేవారు. వారితో చాల కులాసగావుంది.

ఇవన్నీ యిలా వుండగా, చక్కని బంగారుమేనివాడు, సకల సద్గుణరాశి, విద్యా, సంపదలుగలవాడూ, అన్నిటికంటే ముఖ్యం సంఘసంస్కారమునం దెక్కు డభిమానీఅయిన వేణు, నన్ను కాపాడిన వేణు, ప్రతీదినమూ రావడం, నా మంచిచెడ్డలు విచారించడం నాకు మరీ హాయిగా వుండేది. ఆతడు మాట్లాడుతూన్నంతసేపు, చూపులు నాపై బరుపబడినపుడు, నాహృదయసాంద్రం వుప్పొంగుతూవుండేది. కాని, వొక్క యనుమానం నా మనస్సు నెల్లపుడూ కలచివేయుచుండేది. అతడు నామీద ప్రేమతో నా యందంత కరుణామయుడై యున్నాడా, లేక వస్తుతః దయార్ద్ర హృదయుడౌటచే యాతని నడత యీవిధంగా వుందా అనే సంశయముచే నేను అద్భుర్యపడిపోతూ వుండేదానిని.

'వేణూ! అసలు మీరు అనాధశరణాలయానికి వచ్చుట యెట్లు సంభవించింది? సరిగా నా వివాహానికే వచ్చి మీరు నన్ను కాపాడటం అనేది దైవప్రేరేపితంగా తోస్తుంది' అన్నాను నేను వేణుతో వొకసాయంకాలం ఆరూ ఆరున్నరగంటలకు.

'వసంతా! అదియంతా పెద్దగాథ' అన్నాడు వేణు కళ్ళతో నవ్వుతూ.

'మీ మాటలు నాకు మరింత కుతూహలం పుట్టిస్తున్నాయ్. దయుంచి, ఆగాథ చెబుతారూ?' అన్నాను కనీనికలు తిప్పుతూ.

'నీవు కోరడం నేను చెప్పకపోవడమూనా? వసంతా! చెబుతాను విను. నేనూ మరికొందరు స్నేహితులూ కాకినాడలో బి. ఏ. చదువుతూవున్నాం. మాకు సెలవులు యిచ్చారు. మే మా రాత్రియే మా వూరైన యీ నర్సాపురం బయలుదేరాం. నిడదవోలులో

సగాన్నపురం వచ్చి దూప్లికేట్ట్రయిను యెక్కాం. మా కంపార్టుమెంటులోనే పెళ్ళివారుకూడా యెక్కారు.

నా స్నేహితులగు మోహనుడూ, అయ్యాస్వామీ యిద్దరూ చెడ్డబంపివాళ్ళు. వాళ్ళు యెక్కడున్నా పెద్దగోలా అల్లరీని. ఆ రైలులో వాళ్ళు నవ్వు కూతలే కూస్తారు, పాటలే పాడుతారు, సోదులే చెబుతారు. ఆ పయిన పేచీలకు సిద్ధం. వాళ్ళు పెళ్ళికొడుకు కోటేశ్వరావును చూచి నవ్వుకొన్నారు. వాళ్ళు అప్పుడే మా మిగిలిన స్నేహితులకు, అనేక అందగాళ్ళతో పోల్చి వర్ణించారు. తరువాత యేమీ యెఱుగనట్లు, యెవ్వారు పెళ్ళివారు? పెళ్ళికుమారుడు యెవరు? అనే ప్రశ్నలు వేసి వారి వృత్తాంత మామూలాగ్రంగా తెలుసుకొన్నారు.

పెళ్ళికుమారుడు అతిసుందరుడు సరేసరికదా? ఇంక ఆతనికి ఆస్తి—లేదంటే—వొక యెకరంన్నర ఫస్టుక్లాసు మెరకభూమి వుందిట. వొకపూరిల్లు. ఇవి చాలవూ? వర్తకమేమో, చిన్న సోడాకొట్టు. ఈరోజుల్లో అంతకంటె కావలసిం దేముంది! ఇంకా ఆతనికి కావలసినంత కవతం—అతనిమీద ఆధారపడియున్న పత్నులు.

ఇక పెళ్ళికూతు రెల్లావుంటుంది అనే ప్రశ్న వచ్చింది మాలో. పునర్వివాహంకాబట్టి, అందగత్తె, కాస్త చదువుకొన్నపిల్లా అయివుంటుంది. అందుచే నీ సంబంధం యెల్లానో చెడగొట్టాలని భావం.

అక్కణ్ణుంచి నా స్నేహితులు వొకళ్ళతరువాత వొకళ్ళు పెళ్ళికొడుకునీ, ఆతనితరపువారినీ యేడిపించడం మొదలుపెట్టారు. వాళ్ళని నానాఅల్లరీ చేసిపారేశారు. నోరెత్తితే తన్నడానికి అయ్యాస్వామి సిద్ధం. ఈ విధంగా వుంది మాతంతు. మేం ఆ యుదయం మా మా యిళ్ళకు పోయి, వెంటనే స్నానాదికృత్యాలు నిర్వర్తించుకొని, ముస్తాబులయి, కాఫీలుతాగి, అందరం కలసి యిక్కడకు వచ్చేశాం. సమయం, సరిగ్గా సమయాని కందుకున్నాం. మా కార్యం నెఱవేఱింది.

మేం అనుకొన్నట్టు ఆ సన్యాసిపెళ్ళి చెడగొట్టాం — యిదీకథ.' అన్నాడు నవ్వుతూ వేణు.

'మీరా నిందుసభలో అనాథనా, సంబంధంలేనిదానినీ యగు నాకోసం అంతగంభీరంగా మాట్లాడేటప్పుడు మిమ్ము చూచి నేను చాల మురిసిపోయాను' అన్నాను నేను.

'నేను కూడ అదే విధంగా-యీ పెళ్ళికొడుకు నాకు వద్దు-అని నీవు ఖచితంగా చెప్పినప్పుడు నిన్ను చూచి నేనూ మురిసిపోయాను. అప్పుడు నీవు ద్విగుణీకృతమైన అందంతో కన్పించావ్' అన్నాడు వేణు.

'నేను అందంగా వుంటానా?' అన్నాను నేను.

'నీవు ప్రకృతికంటె అందంగా వుంటావు' అన్నాడు వేణు.

'అది మీరెలా చెప్పగలరు?' అని అడిగాను నేను.

'ప్రకృతిలో నా కేదో లోటు కనిపిస్తూనే వుంటుంది. అందులో నాకు పరిపూర్ణమైన సుఖం కన్పడదు' అన్నాడు వేణు.

'ప్రకృతిలో మీ కే దృశ్యం ఆనందదాయకం?' అన్నాను నేను.

'నాకు ప్రకృతిశోభ యిష్టం. చంద్రకిరణం యిష్టం. విరిసిన విరజాజి యిష్టం. మందమారుతంయొక్క-విరహగీతిక యిష్టం' అన్నాడు.

'ఇవన్నీ కూడితే మీ మనస్సు సంతుష్టిపొందదూ మరీ?'

'ఇవన్నీ కూడితే నా ప్రాణాలు హరిస్తవి. అందుచేతనే ప్రకృతిలో నాకు సుధ నిచ్చి రక్షించే గుణం లేదన్నది' అన్నాడు వేణు.

'అయితే మరి సుమసౌరభం మీ కోర్కె నెరవేర్చదూ?'

'కుసుమంలో యెంత అమృతం వుందో, అంత విషంకూడా వుంది' అన్నాడు.

'వేణూ! యీదినం అనుకూలమారుతం వీచింది' అన్నాను నేను.

'దాని ఫలితం?' అన్నాడు.

'దాని ఫలితం—నాహృదయ సుక్షేత్రాన్ని ప్రీతిగాపెంచుకొన్న వలపుతోట వెల్లివిరిసింది' అంది ఆమె.

'మత్తభ్రమరాలు ఆ మకరందాన్ని గ్రోలాలని ఆశిస్తాయ్'.

'ఆమాట నిజమేకాని. మీరా తోటకు కావలివారు'

'యింటి దొంగను యీశ్వరుడైనాపట్టలేడు' అన్నాడు వేణు ముసిముసినవ్వుతో.

'కావలసినవాడు అనుభవిస్తే అందులో పవిత్రతవుంది' అన్నాను నేను, సోగకన్నుల నతనిని చూస్తూ.

'వసంతా!' అన్నాడు వేణు ప్రేమార్తుల నన్ను చూస్తూ.

'వేణూ!' అన్నాను ముగ్ధాక్షుల నాతనిపై బరపి.

వెన్నెల మాయిరుపురి నిస్తేజములైన వదనాలను వొకరి కొకరికి దృగ్గోచరమయ్యేటట్టు సహాయం చేస్తూవుంది.

అప్పుడే కోయిల కూసింది.

'వసంతా! నేనంతకంతకూ పిచ్చివాణ్ణైపోతూన్నాను' అన్నాడు.

'యేం?' అన్నాను.

'యీప్రకృతీ—యీనీఅపరూప సౌందర్యం—నన్ను నీవశుణ్ణి చేసేస్తున్నాయ్' అన్నాడు వేణు.

'మీరుపురుషులు కావున మీబాధచెప్పుకోగలిగారు. నేను స్త్రీని. అందులో అబలను, అనాధను. నేను నాగోడు యెవ్వరికిచెప్పు కొనేది. నేను నిరతమూ యెంతవ్యధ చెందుచున్నానో' అన్నాను నేను

'ఎందుకు?' అన్నాడు వేణు.

'అసూయచేత!' అన్నాను.

'ఏం—అసూయ?' అన్నాడు.

'మీయందం—మీసౌశీల్యం చూచి నేను అసూయ పడిపో తున్నాను. నా హృదయనాధుడు, నా జీవనపతి, యే పుణ్యాత్మురాలి

వశమైపోయి, నా జీవితపుష్పాన్ని వేడినిట్టూర్పుల హతమొనరుస్తుందో అని ప్రతిక్షణమూ బెంగతో వేగిపోతున్నాను.' అన్నాను నేను.

'వసంతా! మన యిరువురిస్థితీ యొకేవిధంగావుంది. దైవం మన యిరువురినీ కలుపుటకే యీ విచిత్రనాటకం ఆడుతున్నాడు. మన కలయిక సంఘాని కొక యుదహారణగా ఆచంద్రార్కం నిలిచిపోవాలి' అన్నాడు ప్రేమమయుడై వేణు.

నా కానంద తమకంతో దేహమంతా కపించింది. నేను నా పరిస్థితి, వేణుపరిస్థితీ యేమీ ఆలోచింపలేని మోహాంధురాలనై పోయాను. అతడూ తొందరపడ్డాడు. సంఘంలో, కుటుబంలో యేవిధ మైన కష్టాలు వస్తాయో అతడు వెనుతిరిగి చూచుకోలేదు. నే నాతనికి అన్యాయంగా-అతడు వెనుతిరిగి చూచుకొనేందుకు అవకాశమివ్వలేదు.

నేను లొంగిపోయాను.

చంద్రుని సాక్షిగా నన్నాతడు ముద్దుపెట్టుకొన్నాడు.

కోరిన వరుడు నాకు లభిస్తాడనే ఆశను నా కారేయి తీయని తలంపులతోటే సరిపోయింది. అవును. శెకెండ్రీటకీ నన్ను పురికొల్పాడు. నే నాతనిని ప్రేమించాను. న న్నాతడు వలచి వస్తూ వున్నాడు. నా భాగ్యం పండింది.

కాని, నే నెంత స్వలాభిని. వేణు పెద్దకుటింబీకుడూ, గుణాన్న త్యుడూ, సౌశీల్యుడూ. అటువంటివానిని ఒక యనాధను, యెవరినో వివాహమాడ తలిదండ్రులను మోసగించి యిల్లు బయలుదేరి వచ్చే సినదానినీ పరిణయమాడ ప్రోత్సహించి, యాతనిని బంధువులలోను, సంఘంలోను విరోధునిజేసి యాతనిజీవితము దుఃఖమయము జేయుట మహాపాపము; యిది భయంకరమైన మోసము. స్వలాభాపేక్షచే నా సంరక్షకుని నేనే మాయోపాయముల బంధించివేసి యాతని భావిజీవితము నాశనమొనర్ప దలంచుచున్న కృతఘ్నురాలను నేను.

ఆహా! వేణు ప్రేమస్వరూపుడు. అతని మధురవాక్కులు, ముగ్ధాత్ముపులు, అమృతహాసములూ మరచిపోవు టెట్లు! ఆ నవలావణ్యుడు వలపూర నన్ను ముద్దుగొంటే ప్రమదమున దేలి నా రక్తనాళము లూగినవి. అట్టి సర్వతుల్యమైన సుఖం నే నెల్లా చేతులార వదులుకోను?

ప్రేమే త్యాగము. త్యాగమే ప్రేమ. నే నతనిని మనఃపూర్వకంగా ప్రేమిస్తూవున్నాను. అందుచే ఆతని సౌఖ్యంకోసం, ఆతని భావిజీవితంకోసం త్యాగం చెయ్యాలి. అతనిపై ప్రతికూలమారుతం వీవకుండా చెయ్యాలి. అతని మనస్సునకు యేవిధమైన క్లేశం కలుగకుండా చేయాలి. ఇది నా నిశ్చితాభిప్రాయం.

ఆరాత్రి నన్ను ప్రేమింపవలదని వేణును బ్రతిమలాడి, నా ప్రేమనుండి యాతనిని విరక్తునిజేయ నిశ్చయించుకొన్నాను. ఆతడు వస్తాడని నేను ముస్తాబునొనర్చుకొనగూడదు. సాధారణపు దుస్తులతో సాధారణంగానే వుండాలి. అతని నే విధంగానూ ఆకర్షించుకొనగూడదు. మాటలవలనా, ప్రోత్సాహంవలన నాతని నధైర్యపరుపవలెను.

రాత్రి యేడుగంట లయింది. వేణు యింకనూ రాలేదు. గత రాత్రి జరిగిన విశేషానికి, ఆత డీ రోజున న్యాయతా ముందరే రావలెను. అటువంటిది, రాత్రిపడిపోతుంది, యేడున్నలగంట లయింది యింకనూ రాలేదు. రెండవద్వారంలో వాకిర్తైను వేణురాకకై తమకపడుతూ వేచియున్నాను. ఎనిమిదిగంటలు కావచ్చింది. చీకటి పడింది. నాకు భయంపుట్టింది. నే దేదో విపరీతమైన సంఘటన తటస్థించింది అనుకొన్నాను. ఆలోచనా లోలనై ఆగుమ్మంలోనే నిలబడి పోయాను.

నా శిరముపై బలమైన దెబ్బ తగిలింది. ఒక్క యార్పుకూడ లేకుండానే స్పృహతప్పి పడిపోయాను. న న్నెవరో యెత్తుకొని పోతూ న్నట్లుమాత్రం నాకు జ్ఞాపకం.

కనులు విప్పి చూసేసరికి నే నొకచాపమీద పడిఉన్నాను. అది వొకపూరిల్లు. అది యే గ్రామమో నాకు తెలీదు. నాకు ప్రత్యక్ష మయిందిమాత్రం నరరూపరాక్షసి యగు వృద్ధమహాలక్ష్మమ్మ. ఆమెను చూడగనే కెవ్వున కేక వేశాను. నా తనువెల్ల కంపించి పోతూఉంది. వెర్రిచూపులు చూస్తూఉన్నాను.

మహాలక్ష్మమ్మ నా దగ్గరగా చేరి నా శిరం ముద్దుపెట్టుకొంది.

'బిడ్డా! వసంతా! నన్ను చూచి నీ వెందుకింత భయపడుతావు? నీ సంరక్షణాభారమంతా నేను నెత్తిమీద పెట్టుకొన్నప్పుడు, నీకు నేను అపకారం చేస్తానా? పిచ్చితల్లీ! నా ప్రయత్నం, నా రహస్యపలాయనం, మరల నిన్ను నేను తీసుకొనిరావడం—యీ అవస్థ అంతా నీ బాగు కొఱకే, నీపునర్వివాహంకొఱకే' అంది ఆమె.

'నా నగలు?' అన్నాను కంపితకంఠాన్న.

ఆమె నవ్వింది. నా శిరస్సు నిమిరింది.

'వసంతా! కలవరపడకు. నీ నగలు నా దగ్గర జాగ్రత్తగానే [illegible] ఆనాడా పెళ్ళివారు వాటి నపహరింతురని నేను వాటిని దొంగిలించి పరారి యయినాను. వాళ్ళని యెంత చేసపుచ్చాలో [illegible] అంతే మోసపుచ్చారు. వాళ్ళదగ్గర అయిదువందలరూపాయలు [illegible] తీసుకొన్నా నన్నమాట అసత్యం. ఒట్టి దబాయింపు...'

'నేను నమ్మను...'

'అవును. నీ వెలా నమ్ముతావ్. వాళ్ళు నాయంతటిదాన్నే మోసగించినపుడు నిన్ను మోసగించు టొకలెక్కా. వాళ్ళు వరుడని నన్ను నమ్మించి మరియొకనిని చూపించారు. అతడు అందగాడు. [illegible]

నీకు వుత్తరములు వ్రాస్తూవుండేవాడు. ఈసన్యాసి పెళ్ళికొడుకు వుబ లాటంగా ఆతనిదగ్గర వుంటూ వొకస్నేహితుడులా వుండేవాడు. ఈ విధంగా వాళ్ళు నన్ను మోసపుచ్చారు. ఇప్పుడు సంగతంతా తెలిసిందా?

ఈకారణాలచేత నిన్నొక్కర్తెనూ విడిచి నేను పరారి కావలసి వచ్చింది. ఇప్పుడు మరల నీ వివాహభారమంతా నా నెత్తిపైన నిడుకొని, యీసారి నేను స్వయంగా నీకు చక్కనిసంబంధం వొకటి చూశాను. అది నీకు అన్నివిధాలా తగింది. యీపెళ్ళి జరుగుతే నాజన్మ సాఫల్యం అవుతుంది. నేను చేసిన మహోపకారానికి న న్నేవిధంగా సత్కరించాలో నీ కప్పుడే అర్థంకాదు. నీపుణ్యాం పండింది.'

'నాకు పెళ్ళివద్దు' అన్నాను నేను.

'అయ్యో తల్లీ! పెళ్ళి వద్దంటా వేమి? నీమతి యెవరు విరిచే శారు? లేక నీవంత భయపడిపోయావా? నీ కేంభయం లేదు. యీ సారి అంతా సవ్యంగా అనుకూలంగా చేస్తానులే. అదీగాక అవతల పెళ్ళివారికి మాటయిచ్చేశాను. యింక ఆమాట తప్పితే మనమర్యాద దక్కదు. వాళ్ళు జమీందారులతో సమానమైనవాళ్ళు. వాళ్ళను త్రోసిపుచ్చామంటే వాళ్ళకోర్కె యేవిధంగానైనా సాధించుకొని తీరుతారు. అప్పుడన్నివిధాలా యల్లరులపాలు కావలసివుంటుంది.

మారుమాటాడక, నీ శ్రేయోభిలాషిణిగా నన్నెంచుకొని, నేను చెప్పినమాట విను. నీవు నామాట త్రోసివేయవని నాకు తెలు సును. నీవు బుద్ధిమంతురాలవు. అనవసరంగా యిప్పుడు పేచీపెట్టడం ఉభయులకూ శ్రేయస్కరంకాదని నీకు తెలీదూ?' అంది మహాలక్ష్మమ్మ.

ఆమెమాటలకు నాకు యేడ్పు వచ్చి యేడ్చేశాను. ఆమె యూరార్చింది. నే నప్పుడు మృత్యువు నాశించాను. గుండె రాయి చేసుకొని నాకర్మ మెట్లో అట్లే జరగనీయ్ అనుకొన్నాను.

ఈవిధంగానైనా వేణు బాగు పడ్డాడే అని సంతోషించాను.

వృద్ధమహాలక్ష్మమ్మకు పూర్తిగా వశురాలైపోయాను. రాక్షసుడు నరసయ్యకూడ యామెతోనే వున్నాడు. వాడే నన్ను చావమోది యెత్తుకొనీ వచ్చేసినవాడు. మేం రాత్రుళ్ళు మజిలీలమీద కోటిపల్లి జేరుకొన్నాం. యిక్కడకు మేం కిత్రం రాత్రి జేరుకొన్నాం.

నరసయ్యా యెవ్వరికోసమో వుదయమే వెళ్ళాడు. వెళ్ళీ యీ రాత్రి యీబంగళాలోనే యేర్పాటుచేశారు. పెళ్ళివారూ రాలేదు, నరసయ్యా రాలేదు. అవ్వ ఆతుత్రతతో రాత్రివేళ నన్ను వెంటబెట్టుకొని యిక్కడికి వచ్చి చూస్తే మీరున్నారు—యిదీ నాదుఃఖచరిత్ర అని చెప్పింది వసంత.

౭

వసంత ఆమెదుఃఖగాథ నా కేకరువుపెడుతూన్నంతసేపు విషాదచకితుడనై వింటూవున్నాను. ఈసౌందర్యరాశి యెన్ని కడగండ్లపాలయిందా యనే ఆలోచనాలోలుణ్ణై క్షణకాలంమౌనంగావున్నాను.

'వసంతా! యీ నీ దీనచరిత్ర వింటేనే నాకు భయంవేస్తూంది. అల్లాంటిది, నీవు అబలవై యిన్ని యిడుములుపడ్డావు. యెన్ని వేడినిట్టూర్పులు విడిచావో, నీహృదయకోశమునుండి యెన్ని రక్తబిందువులు రాలినవో యనిర్వచనీయము! నీయంటి యనాథపైన యాభగవంతుడు పిచ్చుకపై బ్రహ్మాస్త్రము వేసినట్టు, కక్షగట్టి యిన్నితిప్పలు పెట్టాడు.

కాని, మేఘావృతాంబరాన్నే మెఱుపు మెరుస్తుంది. యీ నీ దుఃఖజీవితంలో, ఆనందరేఖ విరియకమానదు' అన్నాను నేను.

'తండ్రీ! నా భావిజీవితంకూడ యగమ్యగోచరమై, నిబిడాంధకారమయమైవుంది. యీ చీకటిబత్రుకుకు కిక వెన్నెలవుందని నేను

తలంపను. అయినను మీవాక్శుద్ధిచే నేను సుఖపడుతానని ఆశించుతూ న్నాను' అంది వసంత.

'అయితే! వసంతా! నేను నిన్నరాత్రి యెందుకు కలుసుకో లేనో నీకు తెలుసునా?' అన్నాను నేను.

'ఏమోనండి, యెందుకు రాలేదో? ప్రతినిత్యమూ వచ్చేవాడు ఆనాడు, అంతలో మాహృదయాలు వెల్లడిచేసుకొన్నారేయి రాలేదు, యేదో చింతయుందని నేను సందేహిస్తున్నాను. వొకవేళ మీపెద్దనాన్నగారు, మీరాతను అనాథశరణాలయానికి రావడం విని యాతనిని నిర్బంధించారేమో? లేకుంటే మరి యే యితర యవాంతర కార్యము చేనైనా రాలేదో నేను గ్రహించుకోలేకుండా వున్నాను.' అంది వసంత.

'అత డెయ్యదో కార్యార్థమై రాలేకపోయివుంటాడు. అంతకు మినహా యేమీ కారణమయ్యుండదు' అన్నాను నేను.

'అయివుండవచ్చును' అంది వసంత.

'వసంతా! నీవూ ఆమహాలక్ష్మమ్మ యిక్కడకు వచ్చి, మరల మీ యిరువురు కలసి వెళ్లారుగదా, ఆమెను తప్పించుకొని నీవు యెవిధంగా రాగాలిగావ్. మరి నరసయ్యజాడ యేమీ తెలియ లేదూ?' అని అడిగాను నేను.

'నరసయ్యజాడ యింతవరకూ లేదు. యెప్పుడు వస్తాడో చెప్పలేం. ఆముసలియవ్వా నేనూ మరల మాబసయగు పూట కూళ్ళయింటికి పోయాం. అక్కడ మా కొక చిన్నగది నద్దికిచ్చారు. మే మిరువురం వెళ్ళిపోయి యిద్దరం పక్కవేశాం. తరువాత నే నా అవ్వను, దీపంవుంటే నిద్రపట్టదని చెప్పి, దీపం ఆర్పించేశాను. ఒక్కఅరగంటసేపు అల్లా వోపిగ్గా నిద్రపోయినట్టు నటిస్తూవున్నాను. అవ్వ నిద్రపోయిందోలేదో నాకు తెలీదు. బహుశా నిద్రపోయే

వుంటుంది. నేను నెమ్మదిగా ఆమె పక్కలోనుంచి లేచి, తలుపు తీసుకొని మరల బయట గొళ్ళెంపెట్టి యీఅర్ధరాత్రి యీబంగళాకని బయలుదేరాను. మనస్సులో అన్నిసందేహాలే—ముసలమ్మ లేస్తుందే మోనని వొకబెంగ. దారిలో యేపోకిరుమోతువాడైన నన్ను కని పెట్టి బాధిస్తాడేమోనని మరివొకభయం. వొకవేళ నరసయ్య యెక్కడైతే నాకొంపతీస్తాడేమోనని వొకదిగులు. అన్నిటికంటే నే నెవరిని ఆశ్రయించుటకు వెళుతూవున్నానో, నే నెవరిని నమ్ముకొని యింతధైర్యంగా బయలుదేరానో ఆయనే నన్ను పరాభవిస్తాడేమో నని యొకహడలూ, యీవిధంగా నామనస్సు నాకే స్తిమితం లేకుండా దైవంచే ప్రేరేపింపబడినట్టుగా, సాహసచేసుకొని యిల్లా మీబంగ ళాకు వస్తున్నాను.

భయానికీ, ఆపదకీ తగినట్టు హోరారున వర్షంవొకటి. కటికి చీకటి మరియొకటి. నిర్మానుష్యం. యిక్కడన్నీ చెట్లూ చేమలూను. యెఱిగున్నాదారి కానరాదైరి. యెల్లానో ప్రాణాలు చేత్తోపట్టుకొని యిక్కడకు వచ్చినవెంటనే తలుపు తట్టుటకు సందేహించాను. యింక యెల్లానూ తప్పదుకదా? యింక తమకంటే వేరే ఆదరువులేదు—అని మిమ్ములను లేపి, మీకు శ్రమనిచ్చాను' అంది వసంత.

'మరియొకరైతే నిన్ను మరింత ఆదరించి గౌరవించేవారు. నేను కాముకుణ్ణి కాబట్టి, వివేకంలేకుండా నిన్ను హింసించినమాట వాస్తవం. అయిందేదో అయింది. యింక నీసంరక్షణనుగురించి యాలో చించాలి' అన్నాను నేను.

'యింక ఆభారమంతా మహానుభావులగుమీదే' అందియామె.

'వసంతా! నిన్ను వుదయమే నీకిష్టమైన ప్రదేశానికి జేర్చే స్తాను. నీవు మరల వేణుకోసరమూ అనాధ శరణయాలనికి నర్సా

పురం బయలుదేరుతావా? లేకుంటే మాతలిదండ్రుల దగ్గరకు ధవళేశ్వరం ప్రయాణమాతావా?' అన్నాను నేను.

'నన్ను మాతలిదండ్రుల దగ్గరకే జేర్చండి' అంది ఆమె ఆనందనేత్రాలతో.

'సరే. అయితే యీజంబుకానామీదనీవు పరుండు. నేను యీ బిచానామీద పరుంటాను. ఉదయమే మనం ప్రయాణం' అన్నాను నేను.

'యీ లోపున అక్రూరుడు నరసయ్య రాకుండావుంటేకదా?' అంది ఆమె జంకుతూ.

'వచ్చినాభయంలేదు. వాడుగినావస్తే, కుళ్ళబొడిపించేయనూ, నీకెందుకు? నీవు చింతనుడిగి సుఖంగా నిద్రపో' అన్నాను నేను.

'మీ యొక్క దయకు ఆజన్మాంతం ఋణస్థురాలను. కాన్నేపు, నాకష్టాలుగట్టెక్కించమని దైవప్రార్థన చేస్తాను'అంది వసంత.

నేను పడుకొన్నాను. ఆమె దైవప్రార్థన ముగించి మేను వాల్చబోయింది. ఇంతలో తలుపు తట్టిన చప్పుడయింది.

యిద్దరం వొక్కసారే లేచికూర్చున్నాం. చెవులు నిక్కపొడుచుకొని శబ్దాన్నివింటున్నాం. తలుపు మరల మరల తట్టబడింది.

మేం ముసలి మహాలక్ష్మమ్మ గొంతు ఆనమాలుపట్టాం. ఆమెయే తలుపు తెరువుడని అరుస్తూంది. వసంత గుండె చేత్తోపట్టుకొని కూర్చుంది. నాకెంతమాత్రం భయంవేయలేదు. పైపెచ్చు నవ్వులాటగావుంది. వసంత తలుపు తియ్యవద్దని నాకు అనేక సార్లు సంజ్ఞ చేసింది. నేనెంతమాత్రం అనుమానింపక, అవ్వ యేమిచేస్తుందీ అనే ధీమాతో తియ్యబోయాను. వసంత యడ్డుపడింది.

'నరసయ్యకూడ వున్నాడూ అంటే నా కొంపమునుగుతుంది. నన్ను రక్షించండి. మీరు తలుపు తియ్యకండి' అని బతిమలాడింది.

'స్త్రీ వగుటచే నీవింతభయపడిపోతూ వున్నావు. నరసయ్యగినా యిక్కడకువస్తే యాతని జాతర చేసి విడుస్తాను. నీకంతగా భయమయితే వొకమూలగానుండు. నేను బయటకువెళ్ళి సమాధానమిచ్చి పంపేస్తాను' అని నేను తలుపు తెరిచాను.

నాకు అవ్వ మహాలక్ష్మమ్మ, ఆవిషపునవ్వుతో ప్రత్యక్షమయింది.

'ఏం నాయనా! మావసంతయేదీ?' అంది ఆమె.

'క్షేమం. బాగుంది ఏ! వసంత?' అన్నాను నేను.

నీవుమాత్రం పరాయివాడావానాయనా! వొకవేళ నీమీద మమతచే యిక్కడికివస్తే వచ్చివుంటుంది. దానిగుణం మెతక, అంచేత తప్పుయేమీ లేదు. పైగా నేనూ యిష్టపడేవున్నానేరి. కాకపోతే ఆమె యిక్కడకుకాకుంటే మరేసన్యాసివాళ్ళవద్దకైనా పోయిందేమోనని అనుమానం' అంది అవ్వ.

'ఏమో అవ్వా! నాకాకేం తెలీదు' అన్నాను నేను.

'ఛీ! దుర్మార్గుడా!! బొంకుతావెందుకు?' అంది ముసలమ్మ.

నేను కోపవివశుణ్ణైపోయాను.

'జాగ్రతగా మాట్లాడు. వసంత నాదగ్గరేవుంది. సీదిక్కున్నా చోట చెప్పుకో. మరోసంగతి— వృదయమే నిన్నూ ఆనరసయ్యనూ అరెస్టుచేయించి, మీయిరువురిసంగతీ కనుక్కొని తీరుతాను......' అని యింకాయేమో అనబోతూవున్నాను. వొకపక్కనుంచి యెవరో వచ్చిన శబ్దమయింది. నేను వెనుతిరిగి చూచేలోపున నా నెత్తిపైన వొక బలమైన దెబ్బతగిలింది.

'హా!' యని నేలమీద కూలబడిపోయాను.

నేను కళ్ళువిప్పి చూచేసరికి నాముఖం మీద నీళ్ళు జల్లుతూ దగ్గర కూర్చున్నాడు రామయ్య. యింకాచుట్టూ ఆవూళ్ళోని జనం మూగారు. అప్పటికి బళ్ళున తెల్లారిపోయింది.

'బాబూ! వంట్లో యెల్లావుంది బాబూ? ఒకచెంపనుంచి చెవుల వరకూ రక్తంకారి గడ్డకట్టింది. యేం ప్రమాదం సంభవించింది?' అన్నాడు రామయ్య.

'రామయ్యా! ముందు వారికి కొన్ని మంచినీళ్ళు యియ్యవోయ్' అన్నాడు వొకాయన.

నేను పడియున్నా ప్రదేశంనుంచి నెమ్మదిగా లేచాను. కొంత స్తిమిత పడ్డాను. ఇప్పుడు నాకు తలకుతగిలిన దెబ్బ బాధగావుంది. అయినా నాతలంపంతా వసంతమీదేవుంది. ఆవసంతను వాళ్లేంచేశారు? అన్యాయంగా ఆమెమాటలు వినకుండా, పాప మా యబల కెంత హానికలిగించాను! నా శరణుజొచ్చిన యనాధను నేను యిన్నికబుర్లూ చెప్పి రక్షింపలేకపోయాను. ఇంతకంటే చచ్చిపోతేమేలు. అయిందేదో అయింది. యిఖ సర్వశక్తులా ప్రయత్నంచేసి యామెను రక్షించాలి. అని యీవిధంగా ఆలోచించుకొన్నాను.

ఆపూరివారంతా నాచుట్టూమూగి నా యప్పటిస్తితికి కారణం తెలుసుకోవాలని చాల కుతూహలంగా వున్నారు. సరే మనంకూడ యిదేసమయాన్ని కొంచెం సంగతిసందర్భాలు వాకబుచేస్తే మంచిదని అనుకొన్నాను.

ఇక్కడికొక ముసిలమ్మా, వొక అమ్మాయీ రాత్రి వర్షంలో తడుస్తూవచ్చారు. ఆ తరువాత వాళ్ళు యిక్కడ యెవరికోసరమో వేచియున్నారు. కావలసినవారు రానందున తిరిగివెళ్ళిపోయారు. మరికొంతసేపటికి ఆ అమ్మాయి వొఖ్ఖర్తే వచ్చి నన్ను లేపి, తనను ఆ ముసలమ్మ, మరి నరసయ్య యను నొకడూ, వారిద్దరూ బలవంతాన్న యెత్తుకొనివచ్చినారనియు, రెండురాత్రుళ్ళు యీవూళ్ళోనే వొకహోటల్లో వుంచారనియూ చెప్పి తనను రక్షింపవలసిందిగా కోరింది. యింతలో ఆముసలది వచ్చి తలుపుతట్టగా, నేను తలుపుతీసి

మాట్లాడుతూంటే, చాటుగా వచ్చి యెవరో నాశిరముమీద బలమైన దెబ్బకొట్టుటచే నేను పడిపోయాను. అప్పుడు పడిపోయిన వానిని యిప్పుడు స్పృహకలిగి లేచాను.' అని జరిగిన సంగతి నాకనుకూల మైనంత మాత్రం వారికి యేకరువు పెట్టాను.

వొకఅమ్మాయీ, వొకముసలిదీ బ్రాహ్మల ప్రయివేటు హోటలులో దిగినసంగతి యెరుగుదుమని కొందరన్నారు. వొకబేబీ హాస్టన్ కారు, రెండురోజులక్రితం వాళ్ళవూరు వచ్చిందనీ, ఆకారులో వొకముసలమ్మా వొకఅమ్మాయీ వున్నారనీ మరికొందఱుచెప్పారు.

వారు పొరుగూరివారగుటచేతను, ఆ అమ్మాయి అద్భుత లావణ్యవతి యగుటచేతనూ, వారిని చూచినవారు, వారిని బాగుగా గుర్తుపెట్టుకోవడంవల్ల యిప్పుడు నాకీసంగతి తేలిగ్గా చెప్పగలిగారు.

ఆతరువాత వారిని వెళ్ళిపోనిచ్చి స్నానాదికృత్యాలొనర్చి, రామయ్యను తీసుకొని తిన్నగా ఆ హోటలుకు వెళ్ళాం. ఆ హోటలు యజమానురాలు వొకవిధవ. ఆమెను వాకబుచేశాను.

ఆ హోటలుకు రెండురోజులక్రితం వొకబలిష్ఠుడైనవ్యక్తీ, వక ముసలిదీ, వొకఅందమైన అమ్మాయి చిన్నకారులో వచ్చారనియు, అ తెల్లవారుఝామునే ఆవ్యక్తి కారులో వెళ్ళిపోయాడనీ ఆడవాళ్ళిద్దరూ ఆపగలూ ఆరాత్రి వున్నారనియూ పొద్దుటచూస్తే గది యంతా ఖాళీగావుందనియూ ఆవిడ చెప్పింది.

'మరి మీకు ఏమైనా ముట్టజెప్పారా?' అని అడిగాను.

'వచ్చిననాడే మాకొకరూపాయినిచ్చాడు. అంతే. అంతకు మినహా మరేంముట్టలేదు.' అంది అమె.

'ఆతడు రాత్రికి వచ్చి గదితలుపులు తట్టలేదా?' అని అడిగాను.

'ఆ! వచ్చాడల్లేవుంది. కారుశబ్దం వినుపించింది. ఆతనిమాటలూ వినుపించాయ్. కాని, మేం యెవళ్ళం లేవలేదు. వారా రాత్రికాడే

పారిపోతారని యెవ్వరనుకొన్నాం? తీరా వుదయం చూద్దుంకదా, గది తలుపులు బార్ల తీసివున్నాయ్. అంతా ఖాళీగావుంది.' అంది ఆమె.

వాళ్ళు యెవళ్ళెవళ్ళెలా వుంటారో యని యడిగి తెలుసుకొన్నాను. వాళ్ళు సరిగ్గా వసంతనూ, మహాలక్ష్మమ్మనూ వర్ణించారు. వసంత చెప్పిన కథంతా యథార్థం అని నమ్మాను.

ఈవిధంగా కొద్దిగా వారిసిగురించి వాకబుచేశాను. యిక అంతకుమినహా నాకేమీ ఆచోకీదొరకలేదు. కర్తవ్యతా విమూఢుడనై తిన్నగా కాకినాడకు బయలుదేరి వచ్చేశాను. వుదయమే స్నానాది కృత్యాలన్నీ నెరవేర్చుకొని, భోజనంచేసి, సావకాశంగా మాట్లాడవచ్చునని యిల్లావచ్చాను.

యిదీ సంగతి రంగం-అని నేను సర్కిల్ యిన్సుపెక్టర్ రంగంతో నాకథంతా చెబుతూవుంటే, యిన్సుపెక్టరయ్యే రంగం ఆశ్చర్యచకితుడైపోయాడు రహదారీబంగళాలో జరిగిన విచిత్రసంఘటన నంతావిని.

౮

'యేయ్ జవాన్!'

'సార్!'

'టీ తీసుకురా!'

ఇన్సుపెక్టర్ రంగం జవానుని టీ తీసుకొనిరమ్మనిచెప్పి యిటూఅటూ పచారుచేస్తూవున్నాడు. నాకథనంతా విని మౌనవ్రతం దాల్చేడేమిరా యీ రంగం అని ఆలోచించుకొంటూన్నాను నేను. ఇంతలో ఫలాహారం— టీ వచ్చింది. మేమిద్దరం నిశ్శబ్దంగానే ఫలహారం తీసుకొన్నాం. ఇంకా టీ తీసుకోలేదు. రెండు కప్పులనిండా జగ్గులోంచి టీ పోసి, రంగం వొక కప్పు చేతిలో తీసుకొని నిలబడి

యాటీని తదేకధ్యానంగా చూస్తూవున్నాను. టీ— పైపొగ యాతని ముఖం కప్పిపుచ్చుతుంది.

'ఆముసలి మహాలక్ష్మమ్మ మరణించింది.'

టీ నోటివద్ద పెట్టికొని తాగబోయీ నేను, నిర్విణ్ణుడనై యిప్పుడు నేను విన్నాపలుకులు రంగమే అన్నాడా లేకుంటే యే దయ్యమైనా అన్నదా? కాక నేనలాభ్రమిస్తూన్నానా? అనిపించింది.

'అవును. ఆపాపాత్మురాలు తగిన శిక్షయే అనుభవించింది— దుర్మరణం పాలయింది.' అన్నాడు రంగం.

మేమిరువురం వొక్కగుటకలో టీ తాగివేశాం. యిద్దరం సిగరెట్లు ముట్టించాం. నే నలానే కుర్చీలో కూలబడి యున్నాను. రంగం యిటూ అటూ తిరుగుతూనే వున్నాడు.

'రంగం! నీమాటలు చాల ఆశ్చర్యంగావున్నాయ్. మహాలక్ష్మమ్మ దుర్మరణం పాలయిందంటున్నావ్. ఆసంగతేమిటో తెలుసుకోడానికి చచ్చిపోతున్నాను.' అన్నాను నేను. రంగం సిగరెట్టు పారవేశి కుర్చీలోకూర్చుని నాముఖం పైదృష్టినిగిడ్చాడు.

'కారు వొకపెద్ద వృక్షానికి గుద్దుకొంది. అప్పుడు మహాలక్ష్మమ్మ తల తుక్కు తుక్కై పోయింది. ఆమెరక్తం నలువైపులా వెదజల్లినట్లయింది. అవయవములు కూడ వూడిపడినవి. చూడు ఆనంద్! ఆ వృద్ధరాక్షసి యెట్టి దుర్మరణం పాలయిందో! భగవంతు డెప్పుడూ న్యాయం చూస్తూనే వుంటాడు. ఆ కథంతా సావకాశంగా చెబుతాను విను.' అన్నాడు రంగం.

'అతి కుతూహలంగా వింటాను. ఆమె మరణించిందంటె నాకు మహాశ్చర్యంగావుంది. నరసయ్య యేమయ్యాడు? వసంతయేమయింది?' అన్నాను నేను.

'నరసయ్యా కూడ కంఠగతప్రాణుడై యున్నాడు. అతనినీ గవర్నమెంటు హాస్పటలులో జేర్చాం.' అన్నాడు రంగం.

'అయితే వసంతో?' అన్నాను భయంతో.

'వసంత సంగతే తెలీదు. ఆమెజాడయే లేదు. ఆమెజాడ లేక పోవడం కూడ కొంత మంచిదే అయ్యింది. ఆమోటారు చెట్టుకు గుద్దు కొనుటచే, కారులోని యిరువురూ ఆ యవస్థకు పాలయ్యారు. వసంత కూడ వుంటే ఆమెకూడ అట్టి దురవస్థకు పాలయ్యేది' అన్నాడు రంగం.

'బతికి పోయాం. వసంత సుఖంగావుంటే అంతేచాలు' అన్నాను.

'ఆమెసంగతే యిప్పుడయోమయంగా వుంది' అన్నాడు రంగం.

'రంగం !అసలు యీవృత్తాంతం నీ కెలా తెలిసిందో—ఆసంఘ సందర్భాలన్నీ వివరంగా చెప్పు' అన్నాను నేను.

'నేను చెప్పబోయీ కథ నర్సాపురంలో మొదలు. వసంత అపహరింపబడింది కదా. ఆరాత్రియే శెక్రిటరీ వేణుకు కబురు చేశాడు. వేణూ, సబిన్సుపెక్టరు రామారావునూ, ఆ మహాలక్ష్మమ్మ నరసయ్యలు క్రితంరోజునుంచి నర్సాపురంలో వున్నాసంగతి రూఢిగా విని వారికోసరం విశ్వప్రయత్నం చేస్తూ ఆనాడు తిరుగుతూన్నారు. అందుచేతనే వేణు ఆరాత్రి శరణాలయానికి వెళ్ళకపోవడానికి కారణం కూడాను. వేణుకు శెక్రిటరీ పంపిన కబురు అందగనే సబిన్సుపెక్టరు రామారావు, వేణూ మరి యితని స్నేహితులూ బయలుదేరి వూరంతా వసంతకోసరం గాలించివేశారు.

తరువాత వేణు స్నేహితులగు మోహన్, అయ్యాస్వామీలతో కలసి వొక చిన్నకారును తీసుకొని, వూరు వూరూ అన్వేషణకు బయలుదేరారు. వీరంతా మొన్న రాత్రి సుమారు రెండుగంటలకు దాక్షారం జేరుకొన్నారు. అక్కడ వాళ్ళు దరియాప్తుచేసి విఫల మనోరథులై, కోటిఫలికూడా చూద్దాం అనుకొని, కోటిఫలికి బయలుదేరారు.

వాళ్ళు వెళుతూవుంటే కోటిఫలినుంచి మరియొకచిన్నకారు వస్తూ వుంది. ఈరాత్రివేళ యీకారుమీద వచ్చేవా రెవరైయుంటా రనే కుతూహలంతో, మనవారు కారును నెమ్మదిచేసి, వచ్చేకారులో వారిని పరీక్షచేద్దామంటే, ఆకారు అతివేగంగా వెళ్ళిపోవుట కారు లోనివారు అస్పష్టంగా కన్పించారు.

'అదే కారు. అందులో ఆముసలి మహాలక్ష్మమ్మవుంది' అన్నాడు ఆతురతగా వేణు.

వెంటనే కారు వెనుకకు తిప్పారు. యెదుటికారును పట్టుకో డానికి, వీలైనంత వేగంగా పోనిస్తూవున్నారు. యెదుటికారుకూడ వెనుక తమ్ము తరుముకొని వస్తూయున్న కారుని చూచి వేగం ద్విగుణీ కృత మొనర్పబడింది. వేణూ అతని స్నేహితులూ వేగం హెచ్చిం చారు. వాళ్ళు ప్రాణాలను తెగించి వేగం వృద్ధిచేసి, ఆయెదుటి కారుని పట్టుకోడానికి యత్నించారు.

వెళుతూ వెళుతూవున్న కారులోనుంచి యేదో దబ్బున నొక తూముదగ్గర విసరివేయబడింది. అది యేమో చూడాలని వెనుకటి కారులోనివారికి ఆతురతకలిగింది. కాని, అంతకంటే యెక్కువగా వారి కా కారును తరుమవలెనని కాంక్షవుండుటచే మరింత వేగంగా మొదటి కారును తరుముతూనే వున్నారు.

మొదటికారు వేగం మరింత హెచ్చింపబడింది. ఆకారు వొక పక్కగానున్న పెద్దవృక్షానికి గుద్దుకొని తలకిందులైపోయింది. రెండవ కారుకూడ ఆప్రదేశానికి జేరుకొంది. మొదటికారు దుస్థితి చూచి వారు చాల భయపడిపోయారు.

మొదటికారులోని ముసలమ్మ మహాలక్ష్మమ్మ వెంటనే మరణించింది. కారును నడుపుతూవున్న నరసయ్య కాళ్ళూ చేతులూ విరిగి పోయాయి. రక్తం వరదలై యాతని నల్లనిదేహంపై పాపంవలె

ప్రాణంతోంది. ఆతనికి ప్రాణాలైతే వున్నాయ్కాని స్పృహలేదు. మనిషి యెన్నటికీ తేరుకొంటాడని వారికి నమ్మకమూలేదు.

వేణు వసంత జాడలు తెలియరామిచే భయపడిపోయాడు. తమదారిలో కాల్వలో మొదటికారువారిచే విసరివేయబడిన వస్తు వేదా యని యాతనికి అనుమానం వచ్చింది.

‘అయ్యస్వామీ! యీనరసయ్య వసంతనుగినా కాల్వలోకి తోసివేశాడేమోనని నా కనుమానంగావుంది. కావున నేను ఆప్రాంతానికి వెళ్ళి ఆప్రదేశం అంతా పరీక్షించాలి’ అన్నాడు వేణు.

‘అయితే మేం నీతోవస్తాం’ అన్నాడు అయ్యస్వామి.

‘అల్లాకాదు. మీరీముసలిదాని శవాన్నీ, యీకంఠగతప్రాణుడైయున్న నరసయ్యనూ వెంటనే కాకినాడ తీసుకొనివెళ్ళండి. అదృష్టముంటే నరసయ్య బతుకుతాడు. మనం ఆలస్యంచేస్తే, పాపం! అతని ప్రాణాలుపోతవి’ అన్నాడు వేణు.

‘అదికాదు. వీరిద్దరినీ మనకారులో వేసుకొని, ఆకాల్వదగ్గరకు వెళ్ళుదాం. అక్కడమనం వసంతను వెదుకుకొనే మనం తర్వాత కాకినాడ వెళుదాం. వొకవేళ ఆమెగినా అక్కడ దొరుకుతే అమెనూ వెంటనే హాస్పిటలుకు తీసుకొని వెళ్ళవలసివుంటుంది. అందుచే మనం తొలుతలో అక్కడకు వెళ్ళుతేనే మంచిది.’ అన్నాడు చూహాన్.

వేణు వొప్పుకొనక తప్పిందికాదు.

వారంతా ముసలిదాని శవాన్నీ, నరసయ్యనూ కారులో వేసుకొని వెనుకకు వెళ్ళారు. అక్కడ కాల్వదగ్గరకువెళ్ళి వసంతకోసరం ఆచుట్టుపక్కలా ఆకాల్వలోనూ వెదికారు. యెక్కడా వసంతజాడలు కనపడలేదు. వారు వసంత నక్కడ తోసివేశారనుకొన్న విషయం వుట్టి భ్రమ అనుకొన్నారు.

'నేనుమాత్రం, యీప్రదేశం విడిచి యింతట్లో రాను. మీరు వెంటనే కాకినాడవెళ్ళి రేపు యిక్కడకురాండి. నే నిక్కడే మీకోసరం చూస్తూవుంటాను.' అని వేణు అన్నాడు. మిగిలినవారిని కాకినాడ వెళ్ళవలసిందిగా ప్రోత్సహించి పంపివేశాడు.

యిదీకథ. యీసంగతి వేణు స్నేహితులగు మోహనూ అయ్యస్వామీ మాకు చెప్పారు అన్నాడు రంగం.

'అయితే మీరు ఆవేణుని చూడలేదన్నమాట' అన్నాను నేను వేణు యెల్లా వుంటాడో యేమో అనే కుతూహలంతో.

'లేదు. అతణ్ణి నే నెఱుగనే యెఱుగను.' అన్నాడు రంగం.

'సరే. తరువాత వేణుస్నేహితులు యిక్కడికివచ్చి, మీతో సంప్రదించి ఆపిదప యేం చాశారూ?' అని అడిగాను.

'వాళ్ళు నిన్నసాయంకాలంవరకూ వేణుకోసరం వెళ్ళడానికి వీలులేకపోయింది. ఇక్కడ వాఙ్మూలం అదీ యివ్వవలసి వచ్చింది. తరువాత స్నేహితుడుకోసరమని బయలుదేరి వెళ్ళారు...' అన్నాడురంగం.

'మరి యిప్పుడు కర్తవ్యం?' అన్నాను నేను.

యింతలో హాలులోని ఫోను మ్రోగింది.

'వొక్కక్షణం ఆగు' అన్నాడు రంగం నన్ను. అతడు హాలులోనికి వెళ్ళి తిరిగి నేను కూర్చున్నా-చోటికి వరండాలోనికి వచ్చేడు.

'ఎక్కడనుంచీ ఫోను?' అన్నాను.

'హాస్పటలునుంచి' అన్నాడు.

'హాస్పటలునుంచా?' అన్నాను ఆశ్చర్యంగా.

'అవును. అక్కణ్ణుంచే. డి. ఎమ్. ఓ నాకు ఫోనుచేశాడు. నరసయ్యప్రాణం పోవడానికి సిద్ధంగావుంది. అతడేదో చెప్పదలచుకొన్నాడు. వెంటనే బయలుదేరి నన్ను రావలసిందిగా సర్జనుకోరాడు'

'ఓహో!...'

'మనం యిద్దరం నాకాముగులో హాస్పటలుకు పోదాం. మనకు నరసయ్యవలన మరికొన్ని సంగతులు తెలుస్తాయ్' అన్నాడు రంగం.

'అవునవును' అన్నాను నేను.

రంగం డ్రెస్సు వేసుకున్నాడు, మేమిరువురం అతనికారులో గవర్నమెంటు హాస్పటలుకు బయలుదేరాం. మేం హాస్పటలుకు జేరుకొని, అక్కడ నరసయ్యను వుంచిన పాకలోకి వెళ్ళాం.

నరసయ్యచుట్టూ డాక్టర్లు మూగివున్నారు.

'హలో! మిష్టర్ రంగనాథం!' అన్నాడు సర్జను.

'హలో! డియర్ డాక్టర్. యితడు నాప్రియమిత్రుడు మిష్టర్ ఆనందరావ్. ఇతనికీ మీవేపెంటుయందు కొంత జోక్యంవుంది' అన్నాడు రంగం.

'థేంక్యూ మిష్టర్ ఆనందరావ్' అన్నాడు సర్జను.

'థేంక్యూ సార్' అన్నాను నేను.

'రోగి మృతుడవ్వడానికి సిద్ధంగా వున్నాడు. అతడు తన జీవిత చరిత్ర చెప్పడానికి కుతూహల పడుతున్నాడు. అందుచేతనే మిమ్ము లను రప్పించింది.' అన్నాడు సర్జను.

మేం ముప్పరం రోగి మంచం దగ్గిరిసా వెళ్ళాం.

నరసయ్యను నే నిదివరకెన్నడూ చూచియుండలేదు. ఆతడు నల్లని స్థూలకాయుడు. నిజంగా భయంకరుడు. పాపం! ప్రస్తుతపు దుర్మరణం ఆతని ముఖంలో కనబడుతూవుంది. యెముకలన్నీ విరిగి పోయాయి. రక్తం స్రవించి యెండిపోయింది. ముఖంలో ముంచుకొని వచ్చిన మృత్యువు దృగ్గోచరమే అయింది.

అతడు కళ్ళువిప్పి మమ్ములను చూస్తూవున్నాడు. నావైపు క్షణకాలం తదేకదీక్షగా చూశాడు. అతడు నన్ను గుర్తింపలేదు.

అతని పాపం పండింది. తత్ఫలంగా యీ మృత్యువు ఆతనిపై బడింది. నన్నాతడు చావమోదినందులకు నా కాతనిపై యేమీ కోపంలేదు. కాని, ఆదుష్టుడు వసంతను పెట్టిన యిబ్బందులకే నా కాతనిపై కక్షగావుంది. కాని, యిప్పటి యాతని మరణవేదనచూస్తే ఆతనిపై ఆభావమూ పోయి జాలియే కలిగింది.

'నేనింక బతకను. నాపాపాలు చెబుతాను వినండి' అన్నాడు నరసయ్య హీనస్వరంతో.

ఇన్సుపెక్టర్ రంగనాథం ఆతనిని హెచ్చరించాడు.

౬

నరసయ్య తన జీవితచరిత్రి చెబుతూవున్నాడు.

"మాది అసలు పెంటపాడు స్వగ్రామం. నేను మహాలక్ష్మమ్మ మనుమణ్ణి. మేం కొద్దిగా పొలమూ పుట్రావున్నావాళ్ళమే. నేను జన్మించిన రెండుమూడు సంవత్సరాలకే మాయమ్మ యింటనుంచి లేచిపోయింది. తలిదండ్రులులేని నన్ను మాయమ్మమ్మ అతిగారాంగా పెంచి పెద్దవాణ్ణిచేసింది. నేను చదువుకొనే రోజుల్లోనే, అల్లరిచిల్లరిగా తిరగడం ప్రారంభించాను. మాస్టరులను కొట్టడం వ్యభిచారంగా తిరగడం యీవిధంగా నాకున్న కాస్త పొలమూ తగలబెట్టి తిరుగుతూ వుండే వాణ్ణి. అక్కడనాకు జతగాళ్లు యెక్కువై పోయారు.

'నరసయ్యా! యీరోజున ఫలానాపనిచేయాలి' అంటే ఆపనికి తయార్. వొక భయం వొకసిగ్గూ యిల్లాంటి వేమీ లేవు.

నెమ్మదిగా జూదం తాగుడూ అలవాటయింది. దానితో డబ్బు చాల అవసరమై పోయింది. వున్న ఆస్తినంతనూ ఆర్పేశాను.

యింక తినుటకు కూడా డబ్బులేని యీనాడు స్థితిలో జూదానికీ తాగుడికీ యెవ్వరిస్తారు.

అక్కడనుంచి గ్యాంగును పోగుజేసుకొని, వొక లీడరునై వాళ్ళనూ వీళ్ళనూ బెదిరించీ, హింసించీ, డబ్బులాగుతూవుండేవాణ్ణి. ఆపిదప నెమ్మదినెమ్మదిగా చిన్నచిన్న దొంగతనాలు మొదలుపెట్టాం.

వొకనాడు దురదృష్టవశాత్తూ పట్టుబడిపోయాను. అప్పుడు నా కారు నెలల ఖైదుపడింది. ఖైదులోంచి నన్ను విడిచిపెట్టివేసిన వెంటనే యింక అక్కడ నిలవలేక మా అవ్వను తీసుకొని తిన్నగా రాజమండ్రి వచ్చేశాం. అక్కడ కూడ తిండికీ దానికీ పట్నం అవుటచే మహాయిబ్బందిగావుంది. అందుచే మేం ధవళేశ్వరం మఖాంపెట్టాం.

ధవళేశ్వరంలో డి. పీ. డబ్లియూ. యింజనీరుగారి దగ్గర కారు డ్రైవరుగా కొలువుకుజేరాను. అంచేత మేం స్థిరంగా ధవళేశ్వరంలో వుండి పోయాం. నేను డ్రైవరు పనిచేస్తూ, పెట్రోలు ఎక్కువగా అపహరించివేస్తూవుండేవాణ్ణి. ఒకనాడు కారుషెడ్డులోదూరి, కారు అడుగునుంచి పెట్రోలు విప్పి తీసీసుకొంటున్నాను. అప్పుడే అక్కడ కాల్చిపారవేసిన సిగరెట్టునిప్పు ఆపెట్రోలులోబడి భగ్గుమంది.

నే నా షెడ్డులోంచి తప్పుకోలేక పోయాను. షెడ్డు మంట తోనూ, పొగతోనూ నిండిపోయింది. యింజనీరుగారి నౌఖరులు చప్పునవచ్చి, నన్ను షెడ్డునుండి బయటకులాగివేశారు. అప్పుడు నాశరీరం కొంచెం అక్కడక్కడా కాలిపోయింది. ఆమోటారు శుభ్రంగా తగులడిపూరుకొంది.

నాకు వుద్యోగంపోయింది. యెఱుగున్నంతవరకూ నాకు వుద్యోగం మెవ్వరూ యివ్వరు. దొంగననీ, రౌడీననీ నాకు పేరువచ్చేశింది.

యింక అక్కణ్ణుంచి నేను మామూలు వుద్యోగం— వాళ్ళనూ వీళ్ళనూ మోసగించి సొమ్ములాగటం మొదలు పెట్టాను. యీవిధంగా

కాలక్షేపంచేస్తూ, లైబ్రేరియనుగా పనిచేసినపుడు సంపాదించిన నాల్గు వందలకూ మరి రెండువందల రూపాయలు అగుపుచేసి, చిన్న హాప్టిన్ కారుకొని అద్దెకు తిప్పుతూన్నాను. లైసెన్సులేకుండా అద్దెకు తిప్పడంచేతను, వేగంగా పోనిచ్చుటచేతను, వొకసారి వొక దున్న పోతుమీద పెట్టుటచేతను మరి రెండువందల రూపాయల వరకు జుల్మానాతో సహితం నాకు ఖర్చుఅయింది. ఆదెబ్బతో నేను కృంగిపోయాను. డబ్బు చాల అవసరం. తాగుటకు సొమ్ములేదు. అప్పులవాళ్లు సొమ్ముకు పీకులతింటున్నారు. జత్తులమారి మాఅవ్వ మెల్లానో సంసారంమాత్రం గడిపివేస్తూనే వుండేది. వొకరోజున ఆమెయే వసంతను గురించి నన్ను సంభాషణలోకి దింపింది.

'నాయనా! నరసయ్యా! నాగేశ్వర్రావు పంతులుగారి నెరుగుదువు కదూ?' అంది.

'ఆ తెలియకేం'

'ఆతనికి వసంతయను కూతురుంది'

'అవును'

'ఆమె బాలవితంతువు'

'ఓహో! అల్లానా?'

'ఆమెకువొక సంబంధంచూశావా అంటే మనకు మంచిలాభం'

'ఒకమాట—ఆమె తలిదండ్రు లీ వివాహ మొప్పుకొంటారా?'

'వొప్పుకోరు'

'అయితే రహస్యంగా ఆమె లేచివచ్చేస్తుందన్నమాట'

'నిక్షేపంలా నగలతో సహితంగా'

'అయితే మరీ మంచిది. తప్పకుండా యీబేరం మనంచూడాలి. మనకు ఋణాలబాధ తీరుతుంది. చేతిలోపైకం పడుతుంది' అన్నాను.

అప్పుడు మే మిరుపురం సంబంధాల కోసరం అనేక ప్రయత్నాలు చేశాం. మొత్తంమీద రాజమండ్రిలో కిళ్లీలగుమ్మకొనే కోటేశ్వర్రావుకు వేశాం జేలు. అతనిదగ్గర అయిదువందల రూపాయలు లంచంకింద లాగేశాం. కొంతకాలం అతనికీ వసంతకూ వుత్తరాలనీ, అవనీ ఇవనీ కొంత గ్రంధం సాగించాం.

పెళ్ళి నిశ్చయంచేశాం. యీచుట్టుపక్కల యెక్కడైనా అయితే పట్టుబడిపోతామని, నర్సాపురం అనాధశరణాలయం శెక్రెటరీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి, అక్కడ పెళ్ళిచేయడానికి యేర్పాటుచేసాం.

అనుకొన్నాప్రకారం, దొంగతనంగా వసంతను తీసికొనిపోయి నర్సాపురంలో జేర్చాం. వసంత వివాహవిషయమై మేం చేసిన యత్నమంతా ఫలించేదేకాని, వరుడు కురూపియగుటయే మా కొంప దీసింది. అన్ని పనులూ తెలివిగా నిర్వర్తించి యిక్కడే మోసపోయాం.

ప్రిప్రిధమంలోనే వాళ్ళు పెళ్ళీగిళ్ళీఅయి కులాసాగావున్నా మానినా- మేం వుభయులం ఆసామ్మితో పరారియగుటకే ప్రియత్నాలుచేసాం. అదేవిధంగా అవ్వా నేనూ పెళ్ళికాకముందే, అపాయం వస్తుందేమోనని జంకి రాజోలు పారిపోయాం.

రాజోలులో వొకళ్ళయింట్లో ముసలమ్మను వుంచేసి, నేను నర్సాపురం మళ్ళా జేరుకొన్నాను. నన్ను సరిగా యెరుగున్నా వారెవరూ లేరు. అందుచే నేను, శరణాలయాన్ని కనిపెట్టుకొని వసంతయొక్క సంగతినంతా తెలుసుకొన్నాను. వేణూ వసంతా ప్రేమగావున్నట్టుగా వొకరోజున వాళ్ళు, పెరటిగుమ్మంలో మాట్లాడుకొంటూంటే విని తెలుసుకొన్నాను.

వసంత నెత్తుకొనిపోయి మరియొకనికి పరిణయంచేస్తే మరల డబ్బుసంపాదించ వచ్చుననే ఆశప్రివేశించింది. రామచంద్రిపురంలో మూడువందల యెకరాల భూమివున్నా పొత్తర్లబ్రాహ్మడున్నాడు.

అతని కీమెను కట్టబెడుతే అధమం అయిదువందలన్నా దొరుకుతాయ్ అని అనుకొన్నాను. అందుచే వసంతను మరల యెత్తుకొనిపోవ నిశ్చయించాను.

మామూలుగానే, వసంత వచ్చి పెరటి గుమ్మంలో వేణు కోసరం వేచియుంది. నేనూ ఆచుట్టుపక్కలే తచ్చాడుతూవున్నాను. వేణు వచ్చి వెళ్ళిపోయినతరువాత ఆమె నపహరించుకొని పోవాలని నాపుద్దేశం. యీఖవేణు యెల్లానూరాలేదని, ఆమెను నాలాటీకర్రతో నెత్తిమీద చావమోదాను. ఆమె కిక్కురు మనక కింద పడిపోయింది.

ఆమెను భుజంమీద వేసుకొని వొక వంటెద్దుబండి ఆదారిని వెడుతూవుంటే పిల్చాను.

'అబ్బీ బండి కడతావా?'

'ఎక్కడి కండి?'

'గోదావరి రేవులోకి'

'కడతానండి'

'ఇదిగో యీామె నాభార్య. చాల జబ్బుగావుంది. జాగ్రత్తగా బండి తోలాలి. నీకు డబ్బు యెక్కువగానే యిస్తాను' అని వసంతను నే నా బండిలో పరుండజేసి రేవులోకి జేరుకొన్నాం.

అక్కడనుంచి రేవుదాటి, యచట సిద్ధంగావుంచుకొన్న కారులో ఆమెతో సహితంగా రాజోలు అవ్వ వున్నచోటికి వచ్చేశాను. యీావిధంగా రహస్యంగా కోటిపల్లి జేరుకొన్నాం.

వసంతను అవ్వ మళ్ళీపెళ్ళికి నయాన్నీ భయాన్నీ వొప్పించేశింది. నేను రామచంద్రపురం పురోహితునితో మాట్లాడడానికి వెళ్ళాను.

'అంత అందగత్తె అయితే నాకు డెబ్బైఖయోపడి వచ్చినా వివాహంచేసుకొంటాను. కాని నేను కోటిపల్లి రావడానికి భయంగా వుంది. ఆమెను తిన్నగా యిక్కడికే నీకారులో తీసుకొనివచ్చేయ్' అన్నాడు విప్రుడు నాతో వసంత వివాహాన్ని గురించి.

'మరి డబ్బువిషయమో?' అన్నాను.

'నీవు కోరింది అయిదు వందలు. అంత యిచ్చుకోలేను' అన్నాడు బాహ్మడు.

'అయితే లాభంలేదు' అన్నాను.

'సరే అల్లానే యేర్పాటు చేస్తాను. పిల్ల యెంత చిన్నదయితే మనకంతమంచిది' అన్నాడు.

'పదునాల్గెళ్ళుంటాయ్' అన్నాను.

'మరోమాట-పిల్ల, పాలమీద మీగడితొరగలావుంటుందా?' అన్నాడు.

'అందంలో రుచిలో కూడ అంతకంటే మిన్నే' అన్నాను.

'భేష్, గట్టివాడివి. నీకు మంచి బహుమతీ యిస్తాను. వెంటనే తీసుకొనిరా? వెళ్ళు వెంటనేవెళ్ళు. మరల యేదైన యవాంతరం వస్తుందేమో' అన్నాడు.

'నాసంగతి మీకు తెలీదా? బ్రహ్మరుద్రుడు వచ్చినాసరే నాప్రయత్నం నిష్ఫలంకాదు' అన్నాను.

'ఆహా! ఆసంగతి నాకు వేరే చెప్పాలా?' అన్నాడు.

నేను తిరిగి కోటిపల్లి వసంతనూ అవ్వనూ విడిచివెళ్ళిన బసకు వచ్చి చూద్దునుకదా? బయట గొళ్లెం పెట్టబడివుంది.

అప్పటికి చాల రాత్రి అయిపోయింది. వర్షం కురిసి వెలిసిపోయింది. తలుపు బయట వేసివుండడం యేదో మోసమే జరిగిందని అనుమానించాను. అనుమానించినట్లే అయింది. బసలో అవ్వ వొక్కర్తేవుంది. నాకూ అనుమానం వృద్ధిపొందింది. మనజాడ యెవరికైనా తెలిసిందా యని మహాలక్ష్మమ్మను వివరంగా అడిగి, వాళ్ళు ఆరాత్రి నాకోసరం బంగళాకువెళ్ళినట్లూ, అక్కడ వాగొకకొత్త వ్యక్తిని కలసుకొన్నట్లూ, తిరిగివచ్చేశి యిరువురూ పడున్నట్లు, ఆపిదప

వసంత పక్కమీాదనుంచి లేచివెళ్ళిపోయిందీ లేనిదీ తెలీదన్నట్లు అవ్వ చెప్పింది.

'వసంత! మననుంచి తప్పించుకోడానికి బంగాళాకెళ్ళివుంటుంది.

'సందేహం లేదు. మనం అక్కడికివెళితే సంగతి సందర్భాలు తేలవి' అన్నాను.

'నాకూ అదే నమ్మకం. వసంత బంగాళాకే వెళ్ళివుంటుంది. మరి మనం యిప్పుడక్కడకు వెళ్ళడం ప్రమాదం కదూ?' అంది.

'మరేం భయంలేదు. మనపని మనం సవ్యంగా చేసుకోవచ్చును. వసంత మనలను తప్పించుకొని యెక్కడికీ పారిపోలేదు' అన్నాను నాకారుపై నామె నెక్కించుకొంటూ.

మేం బంగాళాకు అనతిదూరంలో కారునాపుజేశి, బంగాళా జేరుకొన్నాం. ముసలమ్మను, నేను ముందు తలుపుతట్టవలసినదిగా పంపి నే నా చాటున నక్కాను. ఆమె నేనుచెప్పిన విధంగా ఆ బంగాళాలో ఆయన్ని తలుపులు తీయవలసిందిగా పిలిచి, ఆయన వచ్చాక ఆయనతో సంభాషణకు దిగింది. నే నా సమయాన్ని పక్కగావచ్చి నాలాఠీతో యాతని శిరముపై గట్టిగా మోదుతే వొక్కయార్పుతో కిందకూలిపోయాడు. అని నరసయ్య యింతవరకూ తన కథ చెప్పి కొంచెం ఆయాసంతో వొక్కక్షణం ఆగాడు..................

'ఇదిగో వీరినే నీవు ఆరాత్రి కొట్టేవు' అని నవ్వుతూ యిన్సుపెక్టరు నన్ను నరసయ్యకు చూపించాడు.

నేనూ నవ్వాను.

'క్షమించండి' అన్నాడు నరసయ్య నావైపు జాలిగా చూస్తూ.

'ఫరవా లేదులే' అన్నాను నేను.

'ప్రమాదమైన దెబ్బకాదుకదా?' అన్నాడు నరసయ్య.

'కాదులే. నావిషయంలో నువ్వేమీ విచారింపకు. తరువాత యేం జరిగిందో, ఆ వసంతను నీ వేంచేశావో చెప్పు' అన్నాను నేను.

'అల్లాగేనండి' అన్నాడు నరసయ్య.

... ... ... ... ... ... ... ... ...

నరసయ్య మరల తన కథను మొదలు పెట్టాడు.

'అవ్వ లోనికి వెళ్లి వసంతను వెదికింది. వసంత వొక మూల నిలబడి గజగజా వణకుతూ యేడుస్తూవుంది. ఆమె నిప్పుడు తలచు కొంటే నాగుండెలు బద్దలై పోతూన్నాయ్. పాపం కనికరం కాస్తైనా లేకుండా ఆ అనాధను జెక్కపట్టుకొని యీడ్చుకొనివచ్చి కారులో కూలవేశాను.

ఆమె గట్టిగా యేడుస్తే పీక నులిమి పారవేస్తామన్నాం. ఆముగుద భయభ్రాంతయై దుఃఖాన్ని దిగమింగి, లోలోనయేడుస్తూ కారులో కూలబడింది. నేను కారును వేగంగా, రామచంద్రపురానికి పోనిస్తూ వున్నాను. మేం ద్రాక్షారం దాటాం. మాకు యెదురుగా వొక చిన్న కారువస్తూవుంది. ఈ అర్ధరాత్రి సమయాన్ని యీవైపుకు కారువచ్చేటంతటి అలవాటులేదైరి. యిదేదో అనుమానింప దగ్గదే యనుకొని కారు వేగంగా పోనిస్తున్నాను. యెదుటి కారు మరీ నెమ్మదిగా వస్తుంది.

ఓహో! యీకారు నెమ్మదిగా వస్తుంది. బహుశ మనల నాపు చేయడానికేనేమో యనే వుద్దేశంతో నా కారు వేగం మరీయెక్కువ చేశాను. ఆ కారుని తప్పుకొని వెళ్ళిపోయాం.

'ఆ కారు వస్తుందోలేదో—అటు తిన్నగానే వెళ్ళిపోయిందో చూడు' అన్నాను అవ్వను, అనుమానంపోక.

'వోహో! ప్రమాదంగానేవుంది, ఆకారు ఆగిపోయింది. అదిగో మరల వెనుకను తిప్పారు. యింక సందేహంలేదు; వాళ్ళు మనలనే తరుముతూవున్నారు' అంది అవ్వ వెనుకకు తిరిగి చూచి.

యికనాకు ప్రాణములు పైనే యెగిరిపోయినట్లయ్యాయ్. వాళ్ళు తరుముకొని వస్తూవున్నారు. యిప్పుడు పట్టుకొంటే మహోపద్రవం సంభవిస్తుంది.

నేనూ చూస్తే పాతనేరస్తుణ్ణి. యిప్పుడు వసంత యీవృత్తాంతం వెల్లడిచేసివేస్తుంది. దానితో నాబతుకూ అవ్వబతుకూ అధోగతి పాలైపోతుంది. ఈఅభిప్రాయంతో, యెక్కువ పట్టుదలగా అపాయాన్నైనా శంకించక, ప్రాణములనైనా సరకుగొనక అతివేగంగా కారును పోనిస్తూవున్నాను.

మావెనుక కారు మాకంటే యెక్కువ వేగంగా వస్తూంది. అందుచే నేను పూర్తిగా నిరుత్సాహుడ నైపోయాను. కారువేగం యింతకంటే వేరులేదు.

ఇప్పుడొక్కటే వుపాయం. వసంతను వదిలించుకోవాలి. ఆమె ప్రాణములతో మిగులుతే మా గుట్టుమట్టులు యెప్పటికైనా బయటకు రాకమానవు. ఆమెను సంహరించుటే యుత్తమం అనుకొన్నాను.

ఆహా! దయాదాక్షిణ్యములంటే యింతవరకు యెఱుగదు యీ నా హృదయం. పాషాణముకంటే గట్టిదైన వస్తువుతో విధాత యీ నాహృదయం నిర్మించాడు. వసంతయొక్క లేహృదయంపై నాయినుప పాదాలతో నడచి విహారంచేశాను. ఆమెక్షతహృదయంనుండి స్రవించీ రక్తాన్ని త్రావి నా దాహం తీర్చుకొనేవాడిని. ఆమెకళ్ళలోంచి రక్తం వురల లాగేశాను. ఆ సుగుణరాశిని పెట్టినకష్టానికి తగినశిక్ష నాకు యెంతని యీ పోలీసువారు విధించినా నాకది సరిపడదు. చివరకు దుర్మరణంకూడ వొకమాదిరి శిక్షయే. న్యాయం ఆలోచిస్తే వొక్క చిత్రవధే తగినశిక్ష.........

అబ్బా! అప్పుడు నేను చేసిన పాపకృత్యం తలంచుకొంటే నాకే భయంవేస్తుంది. ఆయబల భయభ్రాంతయై తనువెల్లకంపింప యేడుస్తూ

నన్నూ అవ్వనూ ప్రాధేయపడినా బతిమలాడినా మేం నిర్దాక్షిణ్యులమై, నరరూపరాక్షసులమై, వసంతను కారులోనుంచి, వొక తూముదగ్గరప్రవహించుచున్న కాల్వయందు తోసివేశాము.

మా వెనుక వచ్చుకారు అక్కడ ఆగిపోయి ఆమెను రక్షించడానికి యత్నించాలి. లేదా మనలను వెంటాడినా తగిన సాక్ష్యం లేక మనలను వాళ్ళు బాధింపలేరు, అనుకొన్నాను. కాని వెనుకకారు అక్కడాగక మమ్ము వెంటాడుతూనేవుంది.

తెగించి కారువేగం యెక్కువచేశాను. ఆరాత్రి నే జేసిన పనులన్నీ జ్ఞాపకానికివచ్చాయి. బంగళాలో ఆయన్నికొట్టడం, వసంతను కాల్వలో తోసివెయ్యడం నాకు మరింత మతిపోయినట్లు చేసేశాయ్. నేను పిచ్చివాణ్ణైపోయాను. నాకళ్ళు తిరుగుతూన్నాయ్. నాశరీరం గజగజావణకుతోంది. చేతులుపట్లు సడలినట్టులయ్యాయి.

వేగం పూర్తిగాపెట్టేశాను. యెదుటి పెద్దవృక్షం దృగ్గోచరమైంది. పక్కకు తప్పించడాని కసాధ్యమైపోయింది. పెద్దధ్వనితో కారు ఆచెట్టుని గుద్దేశింది. ఇదీ నాజీవితచరిత్ర.

యిప్పుడు నే నీ హాస్పటలులో మరల కళ్లు తెరిచాను. కాని నేనిప్పుడు మరణవేదన చెందుతూవున్నాను. మీరు చెప్పినారు కదా మహాలక్ష్మమ్మ మరణించిందని. ఆమెయే కాబోలు నన్ను ప్రోత్సాహంగా యమపురికి రమ్మని పిలుస్తోంది—

'బిడ్డా! మనపాపాలు పండాయి. శాశ్వతంగా శిక్షననుభవించాల్సిందేయని మనలను యముడు శాసించాడు. నీవు కూడ త్వరగారా. మనకు భూమిమీద యింకతావు లేదు. వుభయులం యిక్కడ శిక్షననుభవించాలి' అను పరచితమైన కంఠాన్న ఆమె మాటలు నాకు యిప్పుడు కూడ వినిపిస్తూనే వున్నాయ్. నేనింక జీవింపను. వొకవైపున బాధకూడ యెక్కువగానేవుంది. అబ్బా! అబ్బా!!' అన్నాడు.

'మనిషి వస్తుతః మంచివాడై యుంటాడు. పరిస్థితులనుబట్టి చెడ్డవాడైపోతూవుంటాడు' అన్నాను నేను.

'అందుచేతనే నరసయ్య నరకాన్ని వూహించుకొంటూన్నాడు' అన్నాడు రంగనాథం.

'అయితే నరసయ్యా! నీ వొకవిషయం చెప్పడం మరచి పోయావు. అడుగనా?' అన్నాను నేను నరసయ్యను.

'అడగండి' అన్నాడు నరసయ్య హీనస్వరంతో.

'నరసయ్యా! వసంతయొక్క వడ్డాణం, చంద్రహారాలూ యేమి చేశావ్' అని అడిగాను.

'ఆవిషయం అనవసరం అని చెప్పలేదు? ఆవస్తువులు అప్పుడే అమ్మివేసి, తప్పనిసరియగు కొన్నిఋణాలు తీర్చి, మిగిలిన డబ్బు నేను పాడుజేసేశాను. 'బాగానేవుంది' అన్నాను.

'నా కర్మం... యేం చెయ్యను?... పాపాత్ముడనైన నే నింక యీ ప్రపంచంలోవుండటం అనర్థకమని దేవుడు నన్ను యీడ్చుకొని పోతూన్నాడు...యింక ప్రాణాలునిలిచేటట్టులేవు. అయ్యో! బాధ... వసంతా......అబ్బా! వసంతా! ప్రాణాలుపోతున్నాయ్... అబ్బా! అగ్నివంటిమంట... ఈగుండెలో అంపపుకోత. అరుగో వసంతావేణులు. కాదుకాదు యమభటులు. నాకోసరమా! అబ్బా రావడానికి... అప్పుడేనా! అయ్యో!! చచ్చి...పో...తున్నాను...మరణించా...' అని మెలికలు తిరిగి కళ్ళు గట్టిగా మూసివేసి, యెంతో వేదనపడుతూ మరణించాడు నరసయ్య.

నేనూ రంగనాథం వొకరి మొఖాలు వొకరం చూసుకొన్నాం.

'అబ్బా! యీతనిప్రాణి కొట్టుకొని కొట్టుకొని యెంతసేపటికి పోయింది!' అన్నాడు సర్జన్.

'యింతసాహసుడయ్యీ ఆతనికి ప్రాణాలపై ఆశ యెక్కువ. అతడు చచ్చిపోవడానికి యిష్టపడడంలేదు. మంచి పట్టుదలకల వాడేమో—ఓపికపట్టుకొని ప్రాణాలు నిలబెట్టుకొన్నాడు. ఆఖరుకి కర్మకు లొంగిపోయాడు' అన్నాడు మరియొక డాక్టరు.

డాక్టర్లు శవాన్ని కోసి పరీక్షచేశారు. తరువాత ఆశవాన్ని దహనసంస్కారానికి అనుమతి నిచ్చారు.

మేం హాస్పటలులో వుండగానే వొక పోలీసు కానిస్టేబిలు యిన్సుపెక్టర్ రంగనాథంగారి కోసరం వచ్చాడు. మేమంతా పనిలో నుండుటచే ఆతడు యిన్సుపెక్టర్‌గారిని పలకరించలేదు. వాడు యేదేని యితర వ్యవహారం మీాద వచ్చాడేమో అనుకొన్నాం కాని అది వాడు యీా నా చరిత్రసంబంధమైన కబురే తెచ్చాడని గ్రహించాను.

'ఆసంగతేమిటో' అనుకొన్నాను.

## ౧౦

'యేంరోయి! ఏంవచ్చావ్' అన్నాడు రంగనాథం జవానుని.

'సార్. దొరగారికోసం పోలీసుస్టేషనుకు యెవరో వచ్చారు' అన్నాడు కానిస్టేబిల్.

'ఎవరురా?' అన్నాడు రంగనాథం.

'ఎవరో మోహన్‌గారు, అయ్యస్వామిగారూనండి' అన్నాడు.

'సరే పో. మేం మోటారులో వస్తాం' అన్నాడు రంగనాథం.

'ఏం రంగం! వచ్చింది వేణుస్నేహితులల్లే వుందే?'అన్నాను నేను.

'అవును' అన్నాడు రంగనాథం చిఱునవ్వుతో.

'నేనూ వచ్చేదా?' అన్నాను.

'ఆ, అవశ్యం నువ్వుకూడా రావాలి' అన్నాడు రంగనాథం.

ఇన్సుపెక్టరుగారి కారులో నేనూ ఆయన బయలుదేరి తిన్నగా పోలీసుస్టేషనుకు వెళ్ళాం. అక్కడ మాకోసరం ముగ్గురు వ్యక్తులు యెదురుచూస్తూ వున్నారు. వుచితమర్యాదలు జరిగాయ్. వారు ముగ్గురూ మేం యిరువురం, పోలీసు రైటరూ ప్రైవేటుగదిలో జేరాం.

ఆ ముగ్గురూ—ఒకడు మోహన్—రెండవయాతడు అయ్యస్వామీ నట. మూడువయాతడు ఎవరు? అతడపరిచితుడు. వృద్ధుడు.

'వేణూ వసంతలసంగతి తెలిసిందా?' అన్నాడు యిన్సుపెక్టర్.

'అయ్యా! మాకు వారిద్దరిలో వొక్కరూ కన్పించలేదు. వాళ్ళజాడా తెలీదు. ఆ చుట్టుపక్కలంతా గాలించి వెదికేశాం. చివరికి యీ ముసలాయన దోసపొలంలోవున్న చిన్న పాకలోవుంటే యీయన్ని ప్రశ్నించాం.........ఇద్దరు భార్యాభర్తలు మాత్రం యిక్కడ కలుసుకోవడం తటస్థించింది. వారిద్దరూ కలసి వెళ్ళిపోయారు" అని యీయన చెబుతే యీయన చెప్పినదానిని బట్టి మాకు కొంత ధైర్యంవచ్చింది. ఆ పయిన యీతనిని యావద్వృత్తాంతం అడిగి తెలుసుకొన్నాం. సంగతియంతా పూర్తిగావింటే వేణూవసంతల సంగతేయని స్పష్టమైపోయింది. అంచేత యీతనిని కారులో నెక్కించుకొని యిక్కడకు లాక్కొనివచ్చాం.' అనిచెప్పాడు మోహన్.

'వోహో అదా సంగతి! ఏమయ్యా నీ పేరేమి?' అని అడిగాడు రంగనాథం.

'నా పేరు సూరన్నండి' అన్నాడు వృద్ధుడు.

'ఏ కులం?' అన్నాడు యిన్సుపెక్టరు.

'కాపులమండి' అన్నాడు వృద్ధుడు.

'ఏమయ్యా సూరన్నకాపూ వీరు నీ వేవో చెప్పావనీ చెబుతున్నారు. నిజమేనా?' అన్నాడు యిన్సుపెక్టరు.

'చిత్తం, నిజమేనండి!' అన్నాడు కాపు.

'అయితే సూరన్నకాపూ! యావద్వృత్తాంతం వున్నదున్నట్టు విపులంగా చెప్పుతావా?' అన్నాడు యిన్సుపెక్టరు.

'చిత్తం' అన్నాడు కాపు.

'సరే మొదలుపెట్టు' అన్నాడు సర్కిల్ రంగనాథం......

వృద్ధుడైన సూరన్నకాపు, తా నా రేయీ పవలూ జరిగిన సంగతులు చెబుతూ వున్నాడు—

'నే నొక చిన్నరైతును. నాకు దోసపాదులున్నాయ్. ఆపాదులకు కాపలాగా నేను నా పొలంలో నేవున్న చిన్నపాకలో పడుకొంటూ వుంటాను. మాకు మంచినీళ్ళు కావలసివుంటే మాపాకకు రెండుఫర్లాంగుల దూరంలోవున్న కాల్వయే ఆధారం. నాకు రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టదు. నాకు తెల్లవారున దాహంవేసింది. నే నాపిల్లకాల్వ దగ్గరకు వెళుతూవున్నాను. యింతలో నాకు కారుచప్పుడు వినవచ్చింది. నేను ఆకారును పరీక్షగా చూస్తూవున్నాను. ఆకారు ఆగమేఘాల్లా వస్తూవున్నదల్లా కాల్వమీద తూముదగ్గరకు వచ్చేటప్పటికి వేగం తగ్గిపోయింది. ఆకారులోనుంచి యేదో ధ నేలుమని ఆనీటిలో పడింది. నే నాశ్చర్యచకితుడనై పోయాను. ఆ మొదటి కారు వెనుక నే మరియొక కారువచ్చింది. అదీ మొదటిదానివలె నే అతివేగంగాపోతుంది. రెండు కార్లూ వెళ్ళిపోయాయ్.

నేను నీళ్ళంటే అసలు భయపడను. అందులో ఆకాల్వలో పడవేయబడిందేమిటో చూద్దామని కుతూహలం కలిగింది. నేను వెంటనే నీళ్ళలోదిగాను. నేను మధ్యకు వెళ్లీ వెళ్ళడంతోనే నాకొక మనుజదేహం తగిలింది—నాగుండె ఝల్లుమంది.

ఎవరినో హత్యచేసి యిందులో పారవేశారనుకొన్నాను. కాని నాయభిప్రాయం సరికాదు. నేను పైకి ఆవ్యక్తిని లేవదీస్తే ఆవ్యక్తినుంచి యుచ్ఛ్వాసనిశ్వాసలు వెలువడుతూనేవున్నాయ్.

'ఆహా! యీప్రాణిని రక్షింపవలెను. నాజన్మతరిస్తుంది. అను కొన్నాను. అంతలో ఆవ్యక్తి యొక ఆడకూతురని నాకు మరింత హృద్వేగం పుట్టింది. ఆస్త్రీమూర్తిని వెంటనే బయటకు గొనివచ్చి, యామె కాళ్ళూ చేతులూ వంగదీసి, మింగిననీళ్ళు కక్కించాను. యీపై విశేషమంతా వొక్కక్షణంలో జరిగిపోయింది.

ఆ తరువాత నే నామెను తోడ్కొని, నాగుడిసెవద్దకు వెళ్ళాను. అక్కడ ఆమెను మంచెపై బరుండజేసి పెద్దమంటనొకటి రాజేశాను. తరువాత ఆబిడ్డను, ఆమంటదగ్గరకు గొనిపోయి, ఆమెకు వేడిని చూపాను. క్రమీపా యామెకు స్పృహవచ్చింది. విశాలనేత్రాల నాప్రదేశమంతా పరీక్షించి మరల గట్టిగా కళ్ళుమూసుకొంది.

'అమ్మా! నీకేంభయంలేదు. నేను నీ తండ్రివంటివాడిని. నిన్ను అన్నివిధాలా కాపాడుతాను. ధైర్యంగావుండు. ఇదిగో, ఈమంచెపై పరుండుము' అని బతిమలాడాను. ఆమె నిద్రపోలేదు. నావైపు తదేకధ్యాననిమగ్నయై చూస్తూంది. ఆమె కళ్ళల్లో నీళ్లు చిలికాయ్. ఆయనాధబాలికను చూస్తే నాకునూ యెంతో దుఃఖం పొంగిపొరలింది.

'తండ్రీ! నన్నెందుకు రక్షించావ్? నీవు న న్నా నీటిలో చచ్చి పోనిచ్చినచో నాకష్టాలు గట్టెక్కెడివి కదా.'

'అమ్మా! యిప్పుడు నీకు వచ్చిన లోటేమీ లేదు. నాకు కావలసివా రెవరూలేరు. నాకు నీయంటికూతురు వుండేది. నిన్ను నాకూతురుగా భావించుకొని, నీకు యేది కావాలంటే అది తెచ్చి యిస్తూ, నీ సౌఖ్యానికి నాసర్వస్వమూ ధారపోస్తాను. యెల్లప్పుడూ చీకటే వుండదు. వెన్నెలకూడా ఉంటుంది. అధైర్యపడకు. ధైర్యం తెచ్చుకో, యిప్పుడు కాస్సేపుపడుకో. వుదయాన్నే మనయింటికి నిన్ను తీసుకొనివెడుతాను' అని ఆమెను వొప్పించి నిద్రపొమ్మని, నేను పాకలో చాపవేసుకొని పడుకొని యున్నాను. పాప మా

యబల అలసి, నలిగిపోయి వుందేమో—వెంటనే నిద్రపోయింది. నేను మాత్రం మెలుకువగానే యున్నాను. మరికొంతసేపటికి మరల వొక కారు వెళ్ళిపోయిన వైపునుంచి తిరిగివచ్చింది. నే నా ధ్వని విని ఆ యమ్మాయిని లేపలేదు. కారులోవాళ్లు శత్రువులో మిత్రులో యెల్లా తెలుస్తుంది? ఆమె ప్రాణాలనే తీసివేద్దామని పాషాణహృదయులైన ఆ పాపాత్ములు, అసహాయురాలను, అబలను అర్ధరాత్రివేళ కారులోనుంచి కాల్వలోనికి తోసివేసేశారంటే యిక వాళ్ళ మనస్సు వూహించడం దురూహ్యం.

వచ్చినకారు తిరిగి వెనుకకు వెళ్ళిపోయింది. అప్పటికికూడ, ఆ అమ్మాయికి మెలుకువ రాలేదు. మంచిగాఢనిద్రలో వుంది. నేనూ ఆమె కీ సంగతి చెప్పకూడదే అనుకొన్నాను.

మరియొక యరగంట గడిచింది. అప్పటికి తెల్లారిపోతూవుంది. యింతలో నాపొలముల వైపు వొక నూత్నవ్యక్తి వస్తూవున్నాడు. అతనిని 'ఎవరు?' అని కేకవేశాను. అతడు నెమ్మదిగా నావైపునకే వస్తూవున్నాడు.

నేను యెదురువెళ్ళాను. ఆతనికంట యీ యాడకూతురు పడకూడదని నా యాశయము.

'ఎవరయ్యా నీవు?'

'మాది నర్సాపురం, నన్ను వేణు అంటారు. మీ రెవరో?'

'నేను సూరయ్యకాపు అను చిన్నరైతును. మాది యీవూరే. యీదోసపాదులు నావే. యిక్కడ నీటికి కాపలాగా పడుకొంటూ వుంటాను.'

'వోహో అల్లానా! అయితే, యీరాత్రి యిక్కడ కార్లా అవీ-యిటూ అటూ తిరిగాయే మీరు పరీక్షించారా?'

'బాబూ! నాకేం అవసరంవుంది. అనేక కార్లు ప్రొద్దుట లెగుస్తే వెళుతూ పోతూనేవుంటాయ్. అందులో రైళ్ళు తీసివేసేశారైరి.

'అదిగాదయ్యా! అసలు నీవు కారులధ్వనియైనా విన్నావా?'

'ఆ, వినకేం- విన్నాను. రెండుకార్లు వొకదానివెనుక వొకటి వెళ్లాయ్. మగల అందులో వొకటి తిరిగి వచ్చి యీప్రదేశాలలోనే తచ్చాడి తిరిగి వెళ్ళిపోయింది.'

'అదే! కాపుగారూ! యిక్కడ తూముదగ్గర కాల్వలో యేదో పడిన శబ్దం అయింది విన్నారా?'

'ఇవేం ప్రశ్నలు నాయనా?'

'అదికాదయ్యా! నీవు నన్ను అనుమానిస్తూన్నావల్లే వుంది. ఇప్పుడు మే మొక పెద్ద ప్రమాదంలో జిక్కడిపోయాం. మాకు సంబంధించిన వొక అమ్మాయిని శత్రువులు దొంగతనంగా కారు మీద వేసుకొని వచ్చేశారు. వా రేదో యిక్కడ కాల్వలో పడ వేసినట్లు మాకు అనుమానం. అంచేత వా రొకవేళ, ఆ అమ్మాయినే కాల్వలో పడవేశారేమోనని మా భయం. ఇక్కడ చుట్టుపక్కలా, కాల్వలోనూ ఆమెకొరకు గాలించి వెదికాం. ఆమెజాడ లెక్కడా కన్పడలేదు. వొకవేళ మీయంటిపుణ్యాత్ము లెవరైనా రక్షించారేమోనని నా ఆశ.

ఆత డొకసుందరాకారుడూ యువకుడూను. అతని ముఖ వర్చస్సూ, ఆమాటా చూస్తే నాకు అతనియందు వొక విధమైన నమ్మకం కలిగి 'అయితే నీపేరు వేణుకదూ నాయనా? పాపం! ఆమె మీతాలూకు మనిషల్లే వుంది. అంత విచారించి సంశోధన చేస్తూవున్నారు. నాయనా! యిక్కడి నూ కెవరూ అమ్మాయిలూ దొరకలేదూ, యెవళ్ళూ రాలేదు. కావున, మీరు మరియొకచోట వెదుకుకొంటే మంచిది. ఆకాల్వా అవీ సరిగ్గా చూసారా?

శాంతంగా ఆప్రదేశాలన్నీ వెదుకుతే ఆమెయే కన్పిస్తుంది. అసలు అక్కడ విడిచిపెట్టబడితే. లేకుంటే మన మేం చేస్తాం?'

అని నమ్మకంగా చెప్పి వానిని సాగనంపి నేను వేవేగం మంచెదగ్గరకు వెళ్ళాను. పాపం, ఆ అమ్మాయి యింకా నిద్రపోతూనేవుంది.

'అమ్మా! అమ్మా!!' అని తట్టి లేపాను.

'ఎవరు? ఎవరు? వేణా?' అంది ఆమె.

నే నాశ్చర్యపడి 'అమ్మా! నేనూ—సూరన్న కాపును. కంగారు పడకుము, తేరుకొనుము—చూడుము—తెల్లవారింది. ఇక మాయింటికి వెళ్ళిపోదాం. కాని వొక్క-మాట— నీవు నిద్రలో 'వేణు' అన్నావు. అతను యెవరు?

ఆమె వొక్క-క్షణం ఆలోచించి 'వేణు నాభర్త' అంది.

'అయితే అమ్మా! వొకసుందరమైన యువకుడు వేణు పేరువాడు—యిక్కడకు యెవ్వరైనా స్త్రీమూర్తి వచ్చిందా, లేక దారికిందా—అని అడుగుతూ యిక్కడకు వస్తే యేదో సాకు చెప్పి పంపేశాను. అదిగో! అతడు వెళ్ళిపోతూవున్నాడు.' అన్నాను.

'వేణు? నా వేణేనా? కలలోనివార్త. అహ్హాహ్హా! తండ్రీ! నన్ను బాధించడం నీకు కూడ తెలుసునన్నమాట. యిఖ యెన్నడూ వేణు మాటచెప్పి నాతో హాస్యమాడవద్దు.'

'నిజంగానే తల్లి! వొకడు వచ్చి—నేను వేణును—అని చెప్పాడు. అత నింకా యీప్రాంతలనే తిరుగుతూవుంటాడు.'

'అయ్యో! అయితే, పిలూ పిలు! ఆ యన్ని వెంటనే పిలు! తండ్రీ! నీకు పుణ్యముంటుంది.' అని ఆమంచెమీదనుంచి దిగింది. ఇరువురం పాకబయటకువెళ్ళి యింకా ఆచుట్టుపక్కలనేయున్న వేణుని గొంతెత్తి పిలిచాం.

వేణుకు మాపిలుపు వినిపించింది. అతను వెనుకకు తిరిగాడు. యీ అమ్మాయి యెదురుగా వెళుతూంది. నే నామెవెనుక వెళుతూన్నాను. అసలే బలహీనగావుంది, యెక్కడ పడిపోతదో అని నాభయం,

ముగ్గురం కలుసుకొన్నాం. వేణూ వసంతలు కౌగిలించుకొన్నారు. ఇరువురి కళ్ళవెంటా ఆనందభాష్పాలు రాలాయి. నావృద్ధనేత్రాలనుండి ఆనందబాష్పాలే రాలాయి. ఒకొకళ్ళం ఒకొకరికథ పూసగుచ్చినట్లు చెప్పుకొన్నాం.

పిమ్మట ముఫ్ఫురం కాల్వవద్దకుజేరి ముఖాలు కడుకొని తిరిగి పాకలోకి వచ్చేశాం. అచ్చట వేణు వసంతలకు మంచిదోసపండ్లు, ఆవుపాలు ఫలాహారాలుగా యిచ్చాను.-వారు సంతోషపూర్వకంగా భుజించి పాలు త్రాగి మహానందముతో నాకు కృతజ్ఞతలు పదేపదే చెప్పడం మొదలుపెట్టారు. వారి యన్యోన్యానందప్రేరిత ప్రేమ విలాసములు చూస్తూంటే ముచ్చట వేసింది. నాజన్మ తరించినట్లయింది.

'కాపుగారూ! యేదైనా చిన్నకారు యీతూముదగ్గరకు వస్తాది-జాగ్రతగా కనిపెట్టుకొని చూస్తూవుండాలి; కాకినాడకు వెళ్ళవలెను. మేం యిప్పు డెలా వెళ్ళడం' అన్నాడు వేణు.

'అదేం నాయనా! మీరు యింతకుక్రితం చెబుతే బస్సుమీద పంపించేశేవాణ్ణి. యిప్పుడు బస్సులు దొరకవు. కాని ఈవూళ్ళో నారాయుడని వొక యీడిగవాడున్నాడు. వాడికి ఒక గుఱ్ఱం బండివుండి. దానిపై మీరు వెళ్ళండి. సుఖంగా కాకినాడ వెళ్ళిపోతారు.'

'మరి యింకేం! వానిని తీసుకొనిరాండి'

సరే-అని నేను బయలుదేరి నారాయుడి బండిని కట్టింపించుకొని వచ్చాను. వేణు వసంతలు ప్రయాణమయ్యారు. నన్ను కౌగలించుకొని యేడ్చింది వసంత.

'తండ్రీ నీవు నాప్రాణదాతవు' అని నాకు చేతిగాజు యివ్వబోయింది. అది నా గుండెల్లో గుచ్చుకొన్నట్టయింది. నేను వద్దన్నాను. ఆమె వెళ్ళిపోతూంటే, నేను కనిపెంచిన కూతురు అత్తవారింటికి వెళ్ళుతూన్నాదా యన్నట్టు క్లేశము చెందాను.

వేణుకూడ పదేపదే కృతజ్ఞత తెలిపాడు. తాను కబురు చేసి నపుడు నన్ను తప్పక రావలసిందిగా కోరాడు. నేను సరే నన్నాను.

వారిద్దరూ బండి నెక్కి, చిఱునవ్వు మోముల సెలవు-అన్నారు. నాకు యేడ్పువచ్చేసింది. బండి చక్రాలమోత నా యెదలో ప్రతి ధ్వనించి మటుమాయమైపోయింది. వారిరువురూ నాదృష్టినుండి మాయమయ్యారు. కన్నులలో మాత్రం కన్నీటిబిందువులు మిగిలి [illegible] ..... ' అ[illegible] [illegible] [illegible]ముందరిముందు సూరన్న కాపు [illegible] చెప్పాడు.

ఆ కాపు [illegible]థ సాంతా వింటే మాకు సంతోషం కలిగింది.

'అయితే వేణూవసంతలు కలుసుకున్నారు. వారు కాకినాడ వచ్చేవుంటారు. యేహోటలులోనో మఖాం పెట్టివుంటారు ' అన్నాడు యిన్సుపెక్టరు.

'నాయకీనాయకులు కలుసుకొన్నారు. ఇక మనవంతు వారెక్కడ వున్నారో కనుక్కోవడమే' అన్నాను నేను.

'వొకట్రిప్పుఅల్లాంపూరంతా, హోటల్సు కేసి వెళ్ళివద్దామా?' అన్నాడు రంగనాథం. 'నాకుమాత్రం వెళ్ళాలనే వుంది'అన్నాను నేను.

'యింకెందుకుమరీ బయలుదేరండి' అన్నాడు యిన్సుపెక్టర్.

అక్కడివారు మోహన, అయ్యస్వామీ, సూరన్నకాపూ, యీముగ్గురూ నేనూ, యిన్సుపెక్టరుగారూ స్వయంగా బయలు దేరాం. యిన్సుపెక్టరుగారే కారుడ్రైవింగు కూడాను. వూళ్ళో అన్ని హోటల్సూ గాలించి విడిచేశాం. యెక్కడా వాళ్ళజాడ తెలీలేదు. చివరకు నిరుత్సాహంపడిపోయాం. వచ్చినవారు వారిరాక పోలీసు స్టేషనుకైనా తెలియపర్చలేదే అనుకొన్నాం.

'అదిగో నారాయుడు' అన్నాడు సూరన్నకాపు పెద్దగొంతుతో క్షేమం యిన్సుపెక్టరుగారింటివైపు వెళుతూవుంటే.

కారు వెంటనే ఆపుచేశారు.

దర్జాగా సిగరెట్టు కాల్చుకొంటూ, కొరడాకట్ట వూపుకొంటూ కులాసాగా వెళుతూవున్న గుఱ్ఱపుబండివాడు మాకంట బడ్డాడు.

'వొరేయ్! యిల్లారా' అన్నాడు రంగనాథం వాణ్ణి.

వాడు సిగరెట్టు విసిరివేసి, వినయుడై కారుదగ్గరకువచ్చి నమస్కరించి నిలబడ్డాడు.

'ఏ వూరురా నీది? ఎవరవ్వురా నీవు?'

'బాబూ! మాది ద్రాక్షారమండి. నన్ను నారాయుడంటారండి. ఈవూరు గాంధీనగరంలో పంతులుగారికి బండికట్టుకవచ్చానండి!

'ఆయిల్లు మాకు చూపిస్తావా?'

'చిత్తం బాబయ్యా!'

'ఇదిగో యీయన్ని యెఱుగుదువా?' అని సూరన్నకాపుని చూపించాడు యిన్స్పెక్టర్ రంగనాథం, నారాయుడుకి.

'యెఱుగుదునండి మావూరు కాపుగారండి'

'సరే! వెనకాల సీటులో యెక్కు'

నారాయుడు బండి నెక్కాడు. కారు శరవేగాన్ని గాంధీనగరం పోతూవుంది. నారాయుడు వీధిచూపాడు. అది మావీధే. కారు పోతూవుంటే యిన్స్పెక్టర్ రంగనాథం సరిగ్గా బండి మాయింటి ముంగల ఆపాడు.

అక్కడొకవ్యక్తి, బిళ్ళగోచీపంచె, చొక్కా, పొడుగుకోటూ ధరించుకొని, వొక పల్లెటూరివాడూకాకుండా వొక పట్నవాసుడూ కాకుండా, వొక సనాతనుడూకాకుండా, వొక నవనాగరీకుడూ కాకుండా మధ్యస్థంలోవున్నాఆయన దగ్గరకువచ్చి నమస్కరించాడు.

'బాబూ! ఆనందరావుగారిల్లు యేదండి?' అన్నాడు.

'యిదే యెందుకు?మీరెవరు?' అన్నాను నే నందుకొని.

'పనివుందండి' అన్నాడు అతను.

'మీ పేరేం?' అన్నాను.

'నా పేరు నాగేశ్వరావుపంతులండి' అన్నాడు.

'ఏవూరు?' అన్నాను ఆతురతతో.

'ధవళేశ్వరం' అన్నాడు పంతులు.

'ఓహో ధవళేశ్వరం, నాగేశ్వరావుపంతులుగారా! సరే, నేనే ఆనందరావును నాతో యోపని' అన్నాను నేను.

'తమరు వొకసారి లోనికి దయచేస్తే, కాస్సేపు మాట్లాడవలసివుంది' అన్నాడు పంతులు.

'చిత్తం! అల్లానే వస్తానులెండి' అన్నాను నేను.

'నువ్వుచెప్పేయిల్లు యేదోయ్ నారాయుడూ?'

అత డింకా సమాధానం చెప్పకముందే 'నాన్నా!' అనుపిలుపు వినపడింది. ఆశబ్దం వచ్చినవైపు చూద్దుంకదా—వొక నవలావణ్యా యువతి మాయింటిగుమ్మంలో నిలువబడి ఆతురతతో మాలో యెవరికో సంజ్ఞ చేస్తుంది.

'అమ్మా! అమ్మా!! తల్లీ వసంతా! వసంతా!' అంటూ నూతన వ్యక్తి నాగేశ్వరావుపంతులు, గుమ్మంలోని యా అమ్మాయిదగ్గరకు హృద్వేగంతో వెళ్ళాడు. వా రిరువురు కౌగిలించుకొని వలవలా యేడుస్తున్నారు.

మేమంతా ఆశ్చర్యనిశ్శబ్దులమైపోయాం. ఇన్సుపెక్టరుగారు నాముఖంకేసి చూశారు.

'ఆమె యే వసంత' అన్నాను.

'అదిగోనండి కుమారి వసంత' అని వేణుస్నేహితు లన్నారు.

అంతలో మాచిట్టి నన్నుచూచి 'నాన్నా! నాన్నా!' అను కొంటూ వచ్చింది. అప్పుడు కారులోంచి మేం అందరం దిగాం.

'అమ్మా! చిట్టి! అని పలుకరించి చిట్టిని చేరదీసుకొని ముద్దు లాడాను. 'నాన్నా! మరేం, అత్తయ్య అదిగో' అంది చిట్టి వసంతను చూపి. నేను నివ్వెరపోయాను.

'అత్తమ్మెమిటే చిట్టీ?' అన్నాను ఆమె మాయింటికి రావడానికి కారణమేమూ యని యాలోచిస్తూ.

'మరేం మనగోపాలం మామయ్య పెళ్ళాం' అంది చిట్టి.

'హా! గాడ్!!' అన్నాను.

'యేమిటోయ్ ఆనంద్! మీాయమ్మాయి చెప్పేసంగతి?' అన్నాడు యిన్సుపెక్టర్.

ఇంతలో మాబావమర్ది గోపాలం సైకిలుమీాద యెక్కడి నుంచో యింటికి వస్తూవున్నాడు.

'చూచారు? ఇనస్పెక్టరుగారు! ఎంత పొరపాటు జరిగిందో! మాగోపాలం సంగతే నేను మరచిపోయాను. అసలు వాని పూర్తి పేరు వేణు గోపాలరావు. ఆ వేణు అనుపేరు మా కెవ్వరికీ వాడుకలో లేదు. నే నసలు గుర్తు యెఱుగనే యెఱుగను' అన్నాను నేను.

'మహదొడ్డవాడివి. అయితే వేణంటే మీాబావమర్ది గోపాలమే నన్నమాట' అన్నాడు రంగనాథం హృదయానందకరుడై.

వేణుగోపాలం మాదగ్గరకు వచ్చాడు. వసంత లోనికి వెళ్ళి పోయింది. నాగేశ్వరావుపంతులు మమ్మలను కలుసుకొన్నాడు. చిట్టి నాచంకకు జేరింది. గోపాలరావు యిన్సుపెక్టరు రంగనాథానికి నమస్కరించాడు. స్నేహితు లాతనిని కౌగిలించుకొని సంతోషం వెలిబుచ్చారు. సూరన్న కాపునూ, నారాయుడినీ పలకరించాడు గోపాలం.

'ఇదిగో, యీాయన ధవళేశ్వరం, నాగేశ్వరావుపంతులుగారు' అన్నాను.

‘ఓహో. అల్లానా. నమస్కారమండి పంతులుగారు! మీ యమ్మాయి కులాసాగానే వుందండి’ అన్నాడు గోపాలం.

‘వాళ్ళిప్పుడే మాట్లాడుకొన్నారు కూడాను’ అన్నాడు అయ్యస్వామి నవ్వుతూ.

ఒక్క నారాయణమాత్రం రంగనాథందగ్గర సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

సావట్లో కుర్చీలమీద బల్లలమీద సర్దుకున్నాం. సర్కిల్ రంగనాథం సోఫాలోకూర్చుండి సిగరెట్టుకాల్చుకుంటూ, ‘యేమోయి ఆనంద్! ఇప్పుడు యిక్కడ కావలసినవారు అంతావున్నారు. పెళ్ళి బేరాలుసాగిస్తే మంచిదల్లేవుంది. యేమంటావ్?’ అన్నాడు.

‘రంగం! నీకు తెలియంది యేముంది? ఆ యేర్పాట్లు యేవో నీచేతులమీదే కానియ్’ అన్నాను నేను.

‘అయితే పెళ్ళికుమార్తెతండ్రియగు నాగేశ్వరావుపంతులు గారికి వివాహము చేయుట యిష్టమో కాదో?’ అన్నాడు రంగనాథం ప్రకాశంగా.

‘పెద్దలు మీరంతావున్నారు. మీఅందరి అభిప్రాయాన్నిబట్టి నేను సంతోషంగా వర్తించడానికి సిద్ధం’ అన్నాడు పంతులు.

‘భేష్! బాగుంది! పెళ్ళి సెటిల్అయిందన్నమాట. మరి కట్నాలు కానుకల సంగతి యేంటి?’ అన్నాడు రంగం.

‘కట్నంసంగతి మీరేమి ఆలోచింప నవసరంలేదు. నాకు ఈ ఒక్కతే కుమార్తె. నాయావదాస్తి-సుమారు అయిదులక్షలవిలువగల భూములు, భవంతులు సర్వము— ఆమెకే చెందును’ అన్నాడు పంతులు.

గోపాలంస్నేహితులుకూడ వికసితవదనాలతో గుసగుసలాడుకొన్నారు. పెళ్ళి ఖాయమైంది. యిక ముహూర్తం నిశ్చయించాలి,

‘మరిముహూర్తం ఎప్పుడు పెడ్తావోయ్ ఆనంద్!’ అన్నాడు నన్ను రంగం.

‘నాన్నా! మామయ్యపెళ్ళి ఎప్పుడు?’ అంది నాయొడిలో వున్న చిట్టి.

‘పురోహితుడికి కబురుచేసి ముహూర్తం త్వరలో నిశ్చయించితే మంచిదల్లేవుంది రంగం! అంతవరకు యీస్నేహితులంతా మనయింటిలోనే వుంటారు.’ అన్నాను నేను.

యింతలో యింటిలోంచి నాకు సమ్మన్ వచ్చింది. యిప్పుడే వస్తానని వారిక్ చెప్పి చిట్టినెత్తుకొని లోనికి వెళ్ళాను.

ఆనందనేత్రాలతో అబ్బాయినెత్తుకొని తయారైంది రాజ్యం.

‘యేమండోయ్ పెళ్ళిపెద్దగారు!’ అంది నవ్వుతూ.

‘నువ్వుమాత్రమో రాజ్యం! పెళ్ళిపెద్దవుకావు? అందులోను పెళ్ళికుమారుని అక్కగారివైరి’ అన్నాను నేను చిట్టిని కిందకు దింపివేసి చేతులు అందిస్తూ నామీద కురుకుతున్న బాబ్జీని ఎత్తుకొంటూ.

‘నాన్నా! బాబ్జీ! మామయ్య పెళ్ళి’ అన్నాను నేను.

‘అమ్మా! మామయ్య పెళ్ళే’ అంది చిట్టి.

ఇంతలో వసంత వికసితవదనంతో రాజ్యంపక్కగావచ్చి నిలబడింది.

‘యేం! వసంతా! కులాసగావున్నావా?’ అన్నాను ఆమె కుపకారం చేయలేకపోయానుకదా అనే సిగ్గుతో.

‘తండ్రిగారి ఆశీర్వచనం పూరికే పోతుందా’ అంది మృదుమధురకంఠస్వరముతో వసంత.

‘వసంతా! నిన్ను రక్షించలేకపోయాను. నీ వెన్నికష్టాలు పడ్డావు! చివరకు భగవంతుని కృపవల్ల మనం అంతా యీవిధంగా కలుసుకున్నాం’ అన్నాను నేను.

'మీహృదయం విశాలం. నే నెంతయో కృతజ్ఞురాలను' అంది.

నిజానికి నే నేం విశాలతచూపాను? నే నేం వుపకారం చేయ గలిగాను? అల్పసంతోషి గనుక వసంత నన్ను పొగుడుతూంది.

'అయితే మీరు వసంతను ఎరుగుదురన్నమాట!' అంది రాజ్యం.

'ఆ, రాధారిబంగాళాలో మే ముభయులం కలుసుకోవడం తటస్థించింది.

ఆమె నాప్రయాణానికి ముందు రహదారీ బంగళాగురించి చెప్పినమాట జ్ఞాపకానికి తెచ్చుకొని రాజ్యం ఒక చిరునవ్వు నవ్వింది.

నేనూ నవ్వాను.

మారహస్యం పాప మా అమాయకురాలు వసంతకు తెలీదు. తెలిసికోవాలీఅంటే మాపొరుగింటి కామమ్మ సమర్థురాలు.

సావిట్లో స్నేహితుల దగ్గరకు వెళ్లాను. పురోహితుడువచ్చేడు. ముహూర్తం నిశ్చయింపబడింది.

మూడురోజు లుంది.

మా వేణు వసంతులకు వైభయోగాల పెళ్ళి.

మీ అందరకు యిదే ఆహ్వానం.

ఇక సెలవు.

గుడ్ బై.

---

శ్రీరామముద్రాక్షరశాల, రాజమండ్రి.